లరెల్ల దములోన ♦ వరములైన । వారినేభక్తి నాచార్య ♦ వరులగా
ను। గోరివరియింప వలెముక్తి ♦ కోఱకునందు । యతులు వనవాసు
లందర ♦ కన్నమేలు ॥22॥ గీ॥ బ్రంహచారి గృహస్థుఁడ ♦ రణ్యవా
సి। యతులువీరలలో నాశ్ర ♦ మాధికతను । గన్నవారిలో నొక్కరి
కన్నయొక్క । రధికులయగాన నధికులే ♦ యన్నలయ్యా ॥23॥ ప్ర॥
చ్ఛయము॥ నారదీయే॥ పరమరహస్య మంత్రోప నిషదధ్యాయము.
స్మృ॥ బ్రాంహ్మణం గుణసంపన్నం వైష్ణవంచ విశేషతః। నారీవావృ
షలోవాపి గురుత్వం యదిగచ్ఛతి। జిహ్వాచ్ఛేదం తదాకుర్యా త్తస్య
దండం నరాధిపః। శూద్రశిష్యం తథాచైవ నారీశిష్యం త్యజేవచ। చం
డాలకర్మణానిత్యం యోజయేత్తం నరాధిపః। క్షత్రియో వాధవైశ్యో
వా గురుత్వం నేచ్ఛతిప్రభో। సర్వేషాంచ గురుర్జ్ఞేయః బ్రాంహ్మ
ణో వైష్ణవస్సదా॥ ఉ॥ వేదవిదుండు వైష్ణవుఁడు ♦ విప్రుఁడుసద్గురువం
ద్యుడంతకుఁ। గాదనివీరి కన్యులగు ♦ కాంతల క్షత్రియ వైశ్య శూ
ద్రులకుఁ। దావరియింప నొజ్జలుగఁ ♦ దార్కొన నాలుకఁగోసి యం
త్యక। ర్మాదుల నుంచగావలెన ‡ రాధిపుడొజ్జల శిష్యులందరకుఁ ॥24।
గీ॥ విప్రవర్యుల విడుచు ♦ వేరువారి। గురువులుగ గొన్న నాలుకు♦గో
సియంత్య। జాతికర్మల సేయించి ♦ జనవిభుండు। సేయఁదగు దండనంబ
నిచెప్పె । స్మృతులు ॥25। ఉ॥ కాపునవిప్రులాదటకు ♦ గన్యలలో ♦
గణనీయులింక భూ। దేవులతోడఁ బోలగల ♦ ధీరులె వారలు వేరువా
రలే। కావనుద్రోయ శక్తులని ♦ కావలె శిష్యులు వారికేతరుఁ। వేవరి
యింప నన్యులను ♦ వీడకపాప దవాగ్నిగాలరే ।26। ఉ॥ కాన రిధ
త్రివిప్రులను ♦ గాదనియొజ్జల క్షత్రియాదులఁ। మానుకఁగొన్న నెంత
మహా ♦ మంబుగలారలె గానికానిబో। యానరకాగ్ని గ్రాలకయె ♦
యంతకుబోవను నిక్కమంచు వే। యూనిన భక్తివిప్రులకు ♦ నొజ్జల
గాగయికొంట యొప్పగుఁ । 27 । గీ॥ అగ్రజులయందు కూడ నా ♦
చార్యపదవి। కర్హమగు గుణములగ్రాలు ♦ నట్టివారి। నేగుమాత్రము
లుగ గొంట ♦ నిర్ణయంబు। మూర్ఖులను గొంట తుదియందు ♦ ము
ప్పెయగును ।28। ఇదియునుంగాక. గీ॥ యతులె యాచార్య పదవికి

నర్హులగుచు। దొరకుచుండగ వారిని ♦ దోలి వేరె । యాశ్రయించిన
వార ధ ♦ మాధములును । వారుదొరకమి వేరెగా ♦ వచ్చుజుండి ॥
29॥ గీ॥ వారిలో వంశ సరణిగా ♦ వచ్చినట్టి। వారి క్రమముండ రెండ
వ ♦ వారిగూడ। తగదువారి క్రమంబది ♦ తప్పెనేని। పరులదామప్ప
డాశ్రయిం ♦ పంగవచ్చు। వేరువితమైన ♦ పాపముల్వృద్ధిజెందు॥30॥
గీ॥ అనుచు స్మృతులందు యతుల కా ♦ చార్యపదవి। కహాఃతలు
లేద టంటలు ♦ వ్యర్థమైన। పలుకులేవాని పాటిగాఁ ♦ బట్టరాదు। బ
రగు యతులకె యాచార్య ♦ పదవితోలుత ॥31॥ గీ॥ జ్ఞానహీనులు
తమవంశ ♦ సరణిగాను। వచ్చియుండిన గానియు ♦ వారి వదలి। యి
తరులను గురువుల వరి ♦ యింపవలయు । మొదటివారిని భక్తిచే ♦
మ్రొక్కవలయు ॥32॥ స్మృ॥ భిన్ననావా శ్రితస్తబ్ధో యథాపారంనగ
చ్ఛతి । జ్ఞానహీనం గురుంప్రాప్య కుతో మోక్షమవాప్నుయాత్ ॥
గీ॥ బొక్కపడియున్న నావలో ♦ నెక్కినట్టి। వాడుగడ్డనుచేరని ♦ భా
తిజ్ఞాన। హీనుగురువునిగా నాశ్ర ♦ యించినట్టి । వాఁడు మోక్షంబుఁ
బొందఁగ ♦ లేదునిజము ॥33। గీ॥ గురువుజ్ఞానంబుతో తాను ♦ గూడ
నిమెడ। శిష్యుఁడెప్పుడో తనుదా నె ♦ చెడునటంచు। గురువు సుజ్ఞాని
గానుండ ♦ వలయునంచు। గురువనెడి శబ్దమున దేల ♦ గలదుగనుడీ॥
34॥ స్మృ॥ గుశబ్దస్త్వం ధకారస్స్యా ద్రుశ్కారస్త న్నిరోధకః । అంధ
కార నిరోధిత్వా ద్గురురిత్యభిధీయతే॥ గీ॥ చిమ్మచీకటి కర్థమై ♦ చెల
గుధరగు। శబ్దమది బాపుటకు నురు ♦ శబ్దమొప్పు। వీనిఁజేర్చిన చీకటి♦
విప్పఁజేయు। వాడు గురువనియర్థమై వఱలుచుండు ॥35॥ ( ఆచార్య
శబ్దార్థము. ) స్మృ॥ ఆచినోతిహిశాస్త్రార్థాః నాచారేస్థాపయత్య
సౌ। స్వయమాచరతేయస్తు స ఆచార్య ఇతీరితః॥ గీ॥ సకల వేదార్థ
ముల మది ♦ సలుపుచుండి। శిష్య నాచారముల నిల్వ ♦ జేసిచెలగి
యట్టి యాచారములను చే ♦ బట్టినట్టి। వాఁడె యాచార్యునిగ నెన్న
బడును పుడమి ॥36॥ కం॥ గురువాచార్యులు నను నీ ♦ యిరుపలుకు
లపైనఁ జెప్ప ♦ స్మృత్యర్థము నె। ల్లరకును బాగుగఁజూడఁ । కరమ
రుదుగ దేటబడెడి ♦ గాదేధాత్రిఁ ॥37॥ గీ॥ కాన గురువుల సుజ్ఞాని ♦

గానె వెదకి। చేకొనుండని శాస్త్రము ♦ తెల్పుచుండ। నపుడెయజ్ఞాని
గూడ దం ♦ చనెడియర్థ। మదియునందున దేలడే ♦ యార్యులారా॥
38॥ గీ॥ కాన జ్ఞానంబు గుణములు ♦ గలుగునట్టి। వానినే గురువుగ
గాన ♦ వలయుగాని। యిట్టిగుణములు లేనట్టి ♦ యెట్టిడేని। వానిగురు
వుగ చేకొన ♦ వ లనుగాదు ॥39॥ చం॥ తనువతియించు కాలమున ♦
తద్దయుశ్రేష్ఠ్యముఁ బూనియుండి మీా। దనుతొలి పాపసంచయము ♦
డార్కానినం జేడిపోయెనేని తా। ననుదిన మెంతయే బకితి ♦ నార్యు
నినెంతయు నేర్పుబల్కులకే। మనసు గరంగఁ జేయఁగల ♦ మాదిరిఁ
దీర్ప మహాప్రయత్నముల్ ॥40॥ చం॥ విడువక జేయుచు న్మదిని ♦ వే
సర కెంతయున్నువో లెమే। ల్నడవడిలోగుదుర్పవలె ♦ నాటికి। నాటి
కిగానివారిపై। చిడిముడిచెందరాదు తమ ♦ చిత్తమునందునభక్తి వీడు
చుకే। చెడుగులు దూరుటల్వినిన ♦ శిక్షకు పాల్పడఁ జేయగావలెకే
॥41॥ గీ॥ తనకుదండింపఁగాను సా ♦ ధ్యంబుగాక। పోవునెడనెంత యో
చాలబొక్కిపొక్కి। చెవులుమూసుక యపుడె యా ♦ చెంతవిడిచి।
దూరదూరము పోవలె ♦ దుఃఖపడుచు ॥42॥ గీ॥ కాన నాచార్యుఁ
దొలుదొల్త ♦ దానుతానె। యెంతయేనియు శోధించి యేఁగొనవలె।
గాని పిమ్మట దోసము ♦ ల్గలుగవిడువ। రాదుగానెప్డు వారి మాత్రిం
బుభక్తి ॥43॥ గీ॥ ఇంకనాచార్యునెడ శిష్యుఁ ♦ డెట్టినడత। మెలఁగవ
లెనన్న నాబుద్ధి ♦ కొలది శాస్త్ర। పద్ధతిని వీడకుండఁగ ♦ బట్టివ్రా
య। గలను గనుడయ్య మిక్కిలికరుణతోడ ॥44॥ ( ఆచార్యభక్తి
వివరణము, స్తోత్రభాష్యమున ) స్మృ॥ అర్చనీయశ్చ వంద్యశ్చ కీ
ర్తనీయశ్చ సర్వదా। ధ్యాయేజ్జపేన్నమేద్భక్త్యా భజేదభ్యర్చయేన్ము
దా। ఉపాయోపేయభావేన తమేవశరణం వ్రజేత్॥ ఉ॥ మ్రొక్కఁద
గున్నుతింపఁ దగు ♦ మోదముతోడను గొల్వఁగాదగుకే। మ్రొక్కక
పూజసేయఁదగు ♦ సొమ్ములపువ్వుల చందనాదులా। యెక్కుపదారు
దానముల ♦ నీయఁదగుకే దిర మామనస్సుచే। నిక్కము సర్వమీాత
డని ♦ నెమ్మదినమ్మి భజింపఁగావలెకే ॥45॥ (స్తో-డి) స్మృ॥ దండవ
త్ప్రణమేద్భూమా నిర్లజ్జోగురుసన్నిధౌ। శరీరమర్థంప్రాణాంశ్చ సద్గు

రుభ్యో నివేదయేత్ ॥ ఉ॥ లజ్జయొకింత లేక గురులన్గని నంతనఁ గూర్మిభక్తులౌ। ముజ్జగమెల్ల నబ్బినటు♦ మోదముతో ధరసాగి మ్రొక్కులౌ। పజ్జకురాక సేయుచును ♦ ప్రాణమునర్థము మేను నెంతయో। లజ్జవెలుంగ నర్పణము ♦ లాదగ సేయుట శిష్యధర్మముల్ ॥46॥ చం॥ పదపడియెప్పుడేని గురు ♦ వందన సంస్మరణంబుఁ జేసియా। పిదప నె శ్రీసతీశుఁడగు ♦ వేలుపు పెద్ద భజింపనొప్పునే। మదియన నాపరాత్పరుని ♦ యాదరణంబున తోచినంత వ్రా। సెద కరుణించి గాంచుడిక ♦ చిత్తములెల్లను పల్లవింపగాౕ ॥47॥ అయితే॥ మ॥ హరియప్రాకృతుడౌనుగా మరియు నా ♦ ద్యంతంబులుౕ లేకయం। దరకున్డొల్లటివాఁడు నట్టిరినిదొల్త ♦ న్మ్రొక్కగావేడుచుౕ। గురువున్ప్రాకృత దేహ బంధమున చి♦క్కున్వీడఁగాలేని య। ట్టిది మీకిట్టులఁదొల్త మ్రొక్కడనకుం♦ డీమీరు యోచింపకే ॥48॥ గీ॥ హరికి గురువున కిక భేద ♦ మరయ జనదు। జక్కరీతిగఁజూడ తా ♦ నెక్కటగును। గురువునకు మ్రొక్కి పిదపనే ♦ హరికి మ్రొక్క। వలయునను స్మృతులను మీద ♦ నలరఁ జేతు ॥49॥ ( రహః- సా॥ శిష్యకృత్యాధికారమున ) స్మృ॥ యో విష్ణోః ప్రతిమాకారే లోహభావం కరోతియః। యో గురౌ మానుషం భావం ఉభౌ నరకపాతినౌ॥ గీ॥ వెండిబంగరు రూపమౌ ♦ విష్ణు విగ్రహమున లోహంపు భ్రాంతియు ♦ నటులెగురువు। నందుమనుజుడె యను భ్రాంతి ♦ నందునట్టి। వారు నరకంబులోఁ గూలు ♦ వారుగాదె॥50 ( భరద్వాజసంహితయందు ) అర్చ్యావిష్ణౌ శిలాధీర్గురుషు నరమతి ర్వైష్ణవే జాతిబుద్ధిర్విష్ణోర్వా వైష్ణవానాం కలిమథమథనే పాదతీర్థేంబుబుద్ధిః। స్విద్ధైతన్నామమంత్రే సకలకలుషహే శబ్ద సామాన్య బుద్ధిశ్శ్రీశే సర్వేశ్వరేశే తదితర సమధీర్యస్య నానరకీసః॥ సీ॥ పూజనైయేర్పడ్డ ♦ పుండరీకాక్షుని।యందు శిలాబుద్ధి ♦ హరికిభక్తు। లగు వారియందు జా ♦ త్యల్పబుద్ధియు శ్రీశు। భక్తవతంస శ్రీ ♦ పాదతీర్థ। మునసీటిబుద్ధి దా♦మోదర నామమం♦ త్రముల సామాన్యశ ♦ బ్దముల బుద్ధి। హరిహర బ్రహ్మాలం ♦ దరియందు సమబుద్ధి గురువునందు నరొక్క♦ పురుషబుద్ధి। ॥ గీ॥ వీనిలో నేదియేనియు ♦ వెలసె నేని। వాఁడు నరకార్ణ

వంబులో ♦ బడకయెపుడు। తలఁగడనిబల్కె నాభర ♦ ద్వాజసంహి ♦ త
యనువానినిఁగాంచుడీ ♦ ధన్యులారా ॥ 51 ॥ స్మృ॥ గురువద్గురు వర్గ
శ్చ ద్రష్టవ్యో భూతిమిచ్ఛతా। శయనాసనయానాద్యంతదీయమపివంద
యేత్ ॥ గీ ॥ గురువులనుబోలె వారిపు ♦ త్రులనుసతినిబంధువర్గంబు న
ట్టులే ♦ పడకపీట। వాహనాదులనన్నింటి ♦ వందనములు। సలుపవలెన
ని శ్రీరహస్యత్రయమున। 52 ॥ సీ ॥ గురు సమీపమునమ ♦ త్సర
దూరుఁ డైభక్తి గురువునిల్చినయెడ ‡ న్నిలువ వలయు। వారుసింగపు
పీట ♦ వరలిగూర్చొని ప్రీతి । నియమింప మిగులవి ♦ నీతి మెరయ। నే
లపై గూర్చుండి ♦ నిశ్శబ్దుడయి వారు।నిద్రబూనినయెడ నిద్రఁదేలి
వారికన్నను మున్ను ‡ వద్దికతో లేచి మిక్కిలి సేవలోమెలగిహరియె
నన్నుగరుణించి కన్నుల ♦ నున్నవారు వీరలనియెంచి వారికి వెలయుక్రొ
పకు। పాత్రమగు వానికెప్పుడేఁ ♦ బడయరాని। దెయ్యదియులేదు నిజ
మని ♦ యెన్నవలయు। ॥ 53 ॥ శా । ఔరాధాత్రి గురూత్తముండుత
నశిష్య ♦ స్తోత్రసేవాదులన్। మేరల్మీరిన ప్రీతిగాంచగసురా ♦ నీకంబునున్
సర్వమున్। దారెంతోవిలసిల్లుచుందురనుటన్ ♦ ధన్యంబుగా సర్వదే।
వారాధ్యంబనసందియంబుగలదే యాచార్యరత్నంబిలన్ ॥ గీ॥ గురువు
తానొక్కడిలతుష్టి ♦ గొనడయేని। యెల్లసురలునువానిని ♦ నొల్లరయ్య। కా
నగురువర్యునే బ్రహ్మగానుఁదలప।సందియంబు నొకింతయున్ సలుపరా
దు। । 54 ॥ కం ॥ అనిభృగుసంహిత శౌనక॥ మునికిట్టుల శిష్య వృత్తి
ముదమునఁజెప్పెన్। ఘనులారదీనిభక్తిని। గనివేగమెధన్యతములు గండీ
యీరల్ ॥ 55 ॥ రహ శిష్యకృత్యాధికారము ॥ స్మృ॥ స్వయంకుక్తో
పినిత్యోపినిత్యముక్తేశ్వరేపిచ। సాజాత్యంభావయత్యేషాం సాలభావ్య
మైవదేహినః। సజాతీయేనగృహ్ణాతి సజాతీన్మృగపక్షిణః। ఏవం మానుషభావేన మర్త్యాన్ గృహ్ణాతిమాధవః। తస్మాత్ప్రాజ్ఞస్సదాచార్యే స
త్సు తత్సదృశేషుచ।త్యక్త్వామర్త్యమతిశ్శౌరేః పరమ ప్రేమభాజనం। బ
హునాకిమిహోక్తేనగురుభూతోహరిస్స్వయం।మనుజాన్మోచయేత్కా
లేత్వజహన్నివవైభవం ॥ ఉ ॥ హేయ గుణంబులన్వదలి ♦ యెంతయు
భాసిలు దేవదేవు। డన్యాయముఁ జేసి పాపముల ♦ నాటికి నాటికిఁ జెం

దునట్టి మే। మీయెడఁగొల్వ జేయుపుట ♦ లెక్కడనంచని దూరదూ
రమే। బోయెడి వారికెంతయును ♦ బుద్ధినినమ్మక మందఁజేయగా॥
56॥ మ॥ తనుముక్తుఁడయి నిత్యుఁడయ్యు మరి ని ♦ త్యంబుగ బత్రే
ముక్తియం। దున భాసిల్లెడివారి కీశుఁడయి యుం♦ దూరంబుగా బో
వు వా। రిని సౌలభ్యముఁజూపి చూపి యొక ♦ రిన్గొల్వఁగారాదు శ్రీ
హరినేగొల్వగ నన్నిచేకురుగదా ‡ యన్బుద్ధిబుట్టింపగా॥57॥ చ॥
సదయుఁడు లోకమంతయు స ♦ జాతులయందెగ ప్రీతిఁజూపు వా। రి
ది తగునంచువారలకు ♦ నెంతయుబుద్ధి గుదుర్పగానెబో। మదినిడి మే
సజాతుఁడయి ♦ మాన్యతఁగాంచు గురూత్తముఁడునా। యొదవి భజిం
చువారలకు ♦ నొప్పగముక్తికి త్రోవఁజూపెడిన్ ॥58॥ కం॥ ఈగతి
నాయాజాతుల। తాఁగరుణన్జననమంది ♦ తనుఁగొలిచినచో । సేగిసి
బడకుండఁగధర। వేగమ రక్షించి పిదప ♦ విష్ణునిఁ జూపున్ ॥59॥ గీ॥
అందువల్లన మనుజు డా ♦ చార్యునందు। వారినన్నిటఁ బోలిన ♦ వా
నియంపు। ప్రాజ్ఞులందరు నరుఁడను ♦ భావముడిగి। శ్రీశు కరుణకు పా
త్రులై ♦ చెలఁగవలయు ॥60॥ గీ॥ ఎక్కువలు సెప్పగానింక ♦ యేమి
ఫలము। హరియె గురువయిఁ బుట్టి త ♦ న్నధికభక్తి। గొలుచువారల
పాపము ♦ ల్బూలఁద్రోసి। తనదు వైభవ మెల్లను ♦ ధారవోయు ॥61॥
గీ॥ గురువునకు మ్రొక్కిపిదపనే ♦ హరికి మ్రొక్క। వలయునని యెడి
స్మృతినినే♦ వరలఁజేతు। ననుచు వచియించి యేమేమొ ♦ పనివి ప
నివి। బలికితిరటన్న గనుడట్టి ♦ వచన మిదియె ॥62॥ ( స్తోత్రభాష్య
మున॥ మనుః ॥ ) స్మృ॥ భగవద్వాదనంస్వాదు గురువం దనపూర్వ
కమ్। క్షీరంశర్కరయాయుక్తంస్వదతేహి విశేషతః॥ గీ॥ తొలుత గురు
వునకై ప్రణతులుఘటించి। పిదప శ్రీహరి కట్లు సం ♦ ప్రీతిఁ జేయు।
పాలుచక్కెర గలిపిన ♦ భాతిదనరు। ననుచు శోధించిచెప్పె నా♦ మ
నువు స్మృతిని ॥63॥ గీ॥ ఇట్టివానిని నన్నింట ♦ నెరిగిజనులు। ముఖ్య
దైవంబు గురువునే ♦ మొదటదలచి। హరిని నావల దలపంగ ♦ నౌన
టంచు। దెలుపఁదొలుదొల్త గురువునే ♦ దలచుచుంద్రు॥64॥ గీ॥ శ్రు
తుల స్మృతులనుఁ జూపితి ♦ రింతె కాని। యుక్తి నొకయింతఁ జూప

కే ♦ యొప్పగలమె। అనుచు బలికెద రేమొ యో ♦ యార్యులార ।
బుద్ధికొలఁదిఁగ నికదాని ♦ బొందుపరుతు ॥65॥ చం॥ ధనికుఁడొకండు
దాతయయి ♦ దర్శనమేరికి యీఁడునట్టి వా। నినిఁగనఁజేసి యెంతయు
ను ♦ నేర్పునవానికి వీనికిం దగన్। గొనములుసెప్పి యాచకున ♦ కు
న్బలురొక్కముఁ బొందునట్లు సే। సినతఁడువీనిలో నెవరు ♦ సెప్పరెయె
క్కుఁడు యాచకాళికిన్ ॥66॥ మ॥ ఇదియుంగాక ధరిత్రిలోపుడమిరేం ♦
డ్రెల్లన్ సమస్తంబుఁ దీ। ర్పదగన్జాలియు ధర్మనాథుఁడను పే ♦ రన్ధీ
రుఁడా మొక్కఁడిన్। గుదురన్బెట్టుచు వాని యానతులఁగై ♦ కొంచున్న
నుశ్శేయు భా । తిదగన్మోక్షమునిచ్చు సద్గురుని సూ ♦ క్తిన్బట్టి లక్ష్మీ
శుఁడున్ ॥67॥ చం॥ అవనికి రేడు ధీరుఁడెక ♦ దా యగు నాతఁడు ధీ
రుఁడయ్యు మం। త్రివరుని వ్రాతగానకయె ♦ తీర్పును సెప్పనె యట్టి
మంత్రిపుం। గవుఁడును సభ్యరాజనులఁ ♦ గాదనియొక్కఁడె ధర్మనిర్ణ
యం। బవునని జెప్పఁజుండునొకొ ♦ యార్యవరేణ్యులుమీరె సెప్పుడీ
॥68॥ గీ॥ కానతనుదాన ప్రజకు మొ ♦ క్షంబునీయ । నర్హుఁడయ్యును
నాచార్యు ♦ నాజ్ఞలేక । యీయతగదని సంకల్ప ♦ మెప్పుడిడెనొ ।
యపుడెగురువాది సే ♦ వ్యాహ్యుఁడయ్యెగాదె ॥69॥ మ॥ ఇలదైవంబెగు
రూత్తముండెయని తా ♦ నెంతేని సద్భక్తిఁబూ। జలఁగావించుచునా
నతుల్సలుపుచున్ ♦ శతురిన్వసన్దురించుచున్। దలపుల్పండుగఁ జేయు
చున్ మఱియు స ♦ త్కల్యాణ చారిత్రముల్ । గలయంజేయుచు ను
న్నవారలకు కాం ‡ క్షల్దీరవే యెందునేన్ ॥70॥ గీ॥ ఎవ్వఁడవు నీవ
టంచు త ♦ నెవ్వఁడడుగ। గురువుపేరును వచియించి ♦ కూర్మివారి ।
శిష్యుఁడనటంచు తొలుదొల్తఁ ♦ జెప్పిపిదప। నన్ను నీపేరఁ బిల్తుర ♦
నంగవలయు। కాని తనపేరు సెప్పుట ♦ కానికాదు ॥71॥ ఉ॥ కావున
భక్తసంతతికిఁ ♦ గన్నులపండుపుసేయ శ్రీశుఁడే। తావహించి మే
నులను ♦ తద్దయుభక్తిని తన్నుఁగొల్వఁపా । పావళిద్రుంచి మోక్షము
ను ♦ పట్టుగనిచ్చు గురుండటంచు నీ। భావమునందునింక నర ♦ భా
వము మానుడు మీరు వేగమె ॥72॥ గీ॥ గురువరులవీడి యొంతయే ♦
స్వామినిఁగొల్వ। మఱియు నీతనపయి ప్రీతి ♦ నలరఁజేసి। బోవ దలప

దుగావున ♦ బుద్ధిగలుగు। వారలెల్లను గురువును ♦ వదలరాదు । 73
॥ గీ ॥ ఆచార్యాధ్యాయంబిది। నా చేత వ్రాయఁజేసె ♦ నారాయ
ణుఁడే। యీచాయ నైదవదిసా♦ రాచారము గాంచి ధన్యు♦ లందరు
గండీ ॥ 74 ॥ శ్రీః శ్రీః



శ్రీః
శ్రీకురుమూర్తిణ శ్రీనివాస ప్రసీద.
శ్రీహయగ్రీవాయ నమోనమః.

# ప్ర ణ వ ద ర్ప ణ ము .

## చక్రాంకనాధ్యాయము. ( ౬ )

గీ॥ నాగురూత్తములనుదొల్త ♦ నడుమనాథ।యామునార్యులు కొ
నన శ్రీ ♦ హరివెలుంగ। నిటుల వరుసగ భక్తియెం ♦ తేనిబొదల। గురు
పరంపర నెల్ల నే ♦ గొలుచువాఁడ.

ఉ ॥ ఈరీతిన్గురువర్యులన్దలఁచి యెం ♦ తేభక్తితోవారిస। త్కారు
ణ్యంబును గాంచు పద్ధతినియం ♦ తన్బాగుగా జూచియ। వ్వారిన్వేడిన
పంచసంస్కారణముల్ ♦ వర్ధిష్ణులైగాంతురె। వ్వారోవారలెధన్యులౌదు
రిలపై ♦ వంద్యాళిలో నంతకుణ ॥ 1 ॥ గీ ॥ పంచసంస్కార మనెడి
శ ♦ బ్దమునకర్థ। మేమియన నైదుపనులచే ♦ నచట నచట। బాగుసే
యుటకర్థమై ♦ బరిఢవిల్లు। నైదుపనులవి యెవ్వినా ♦ నలరజేతు ॥ 2
॥ సీ ॥మంత్రపూజితవహ్ని ♦ మధ్యభాసిలు శంఖచక్రచిహ్నములభుం
జములఁ గనుట । పంౘ్రడెందుగా నూర్ధ్వ ♦ పుండ్రములుబ్బానుట విష్ణు
జెప్పెడిపేర్ల♦ వెలయగనుట। తనపాపసమితివి♦ ధ్వంసంబుఁజేసెడి మం
త్రిరత్నములను♦ మదినినిడుట। భగవంతుఁడై పర♦ బ్రహ్మమై విల

సిల్లు వారికిపూజలసల్పు ♦ సరణిగనుట। గీ॥ ఇటుల భాసిలుచుండెడి♦ యివియె యుడుడు। పనులువీనిని నాచార్య ♦ ఘనుని కృపకు। పాత్రమయి వారివలననే ♦ బడసివిష్ణు । పూజసేయుట కర్హమై ♦ బోవవలయు ॥4॥ గీ॥ ఇందునాచార్య విషయంబు ♦ పొందుపఱచి । నాడదొాల్తనె చక్రాంక ♦ నంబుజాడ। దేటపరిచెద నేనిప్పు ♦ డెలసినంత । దీనిఁజదువుఁడు సద్భక్తి ♦ నూని తమరు ॥5॥ (ప్రపన్నానుష్ఠాన భాస్కరమున, శతపథబ్రాహ్మణమునసామవేద శాఖయందు)స్మృ॥ పవిత్రమిత్యగ్నిః। అగ్నిర్వై సహస్రారః । సహస్రారో నేమిః । నేమినాతప్తతనూః। బ్రహ్మణస్సాయుజ్యం సలోకతా మాప్నోతి॥ గీ॥ ధరపవిత్రమనాయగ్ని ♦ దనరుచుండు । నగ్గియన వేయియంచుల ♦ నాయుధంబు। దానికే చక్రమను పేరు ♦ దనరుచుండు। చక్రసంతప్త భుజలుమో ♦ క్షంబుగంద్రు ॥6॥ (డి, ప్ర, చా, యజుర్వేదే। శతపథబ్రాహ్మణే। కఠశాఖాయాం॥ శ్రు॥ తప్తంచక్రం ద్విభుజేధార్యం। ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ విష్ణుంపరంధ్యాయతి యోమహాత్మా॥ గీ॥ తప్తచక్రములను భుజ ♦ ద్వయమునందు । దాల్పుడనుగద యజుర్వేదంబు తేట। నూర్ధ్వపుండ్రంబు చక్రంబు♦ నూనియున్న। వాడు ఘనుఁడని కఠశాఖ ♦ పఱిలఁబలికె ॥7॥ (డి, కాండ.) శ్రు। దేవాసోయేనవిధృతేన బాహునా। సుదర్శనేన ప్రయాంతం। స్వర్గమాయాంతితామలోక విసృష్టవీతస్వ్యయంతి। బ్రాహ్మణావైసర్వం। సర్వాశ్శూద్రాణా మిత్యగ్నినావైహోత్రా తప్తచక్రం ద్విభుజేధార్యే తోర్ధ్వపుండ్రమాలిఖేత్ । తస్మాద్ద్విరేఖం భవతి । పునరాగమనం నచేతి। బ్రహ్మణస్సాయుజ్యం సలోకతామాప్నోతి॥ గీ॥ సురలుద్విజలును క్షత్రియ ♦ శూద్రజనులు। నందరును హోమచేతప్త ♦ మైన చక్రము భుజంబుల రెంట తాఁ ♦ బూనియూర్ధ్వ। పుండ్రములఁ దాల్పముక్తికి బోదురపుడు ॥8॥ (నారాయణ సారసంగ్రహమున, బ్రహ్మపురాణమున) స్మృ॥ అగ్నితప్తంపవిత్రం చధృత్వావైబాహుమూలయోః। త్యక్త్వా యమపురంఘోరం యాంతివిష్ణోః పరంపదమ్॥ గీ॥ బాహుమూలంబులందు స ♦ ద్వహ్నితప్త। శంఖ చక్రములను బూను ♦ స

జనుండు। ఘోరమైనట్టి యమపురిఁ ♦ గూలదన్ని। వైష్ణవంబగు పద
విలో ♦ వరలుచుండు ।9। ( ది, బృహన్నారదీయె ) స్మృ॥ సుదర్శ
నేన యస్యాంగంలాంఛితంతు భవేత్సదా। దేహాంతస్యవసేన్నిత్యం శ్రి
యాసార్థం స్వయంహరిః। చక్రాంకితాయుధందృష్ట్వా యమోపిభయ
శంకితః। ప్రణామందూరతః కృత్వావిష్ణుభక్తం విమత్సరం। చక్రాంకి
తాయవిప్రాయ విష్ణుభక్తాయధీమతే। భిక్షామాత్రప్రదానేన వైష్ణవంగ
తి మాప్నుయాత్॥ మ॥ ఇలచక్రాంకిత దేహరాజముల ల♦ క్ష్మీశుం
డు శ్రీదేవితో। వెయున్నావున వీనిగాంచి యముఁడు ♦ నీభతిన్మహా
దూరమే ॥ నిలిచేమిక్కిలి వందనమ్మొనరుగా ♦ నీరాడుబో యట్టిదే।
హులకొక్కంతయు బిచ్చముంచినజనుం♦ డోహోహరింజేరెడిన్ ॥౯॥

॥ గీ ॥ హుంతవహ్ని తప్తచక్రాం । చితులయి హత
పాపులగుచు ♦ జేజేసములై ॥ హితులయి హరికికసరక ♦ మ్యతు
లైవేవేగహరిని ♦ జొచ్చెదరుసుడీ॥ 10॥ ( ప్రపన్నానుష్ఠాన భాస్క
రమున, పరాశరోత్తరఖండలో ) (స్మృ॥ వినాయజ్ఞోపవీతేన వినాచ
క్రస్యధారణాత్। వినాద్వయేనైవవిప్రశ్చండాలత్వమవాప్నుయాత్॥
విధినా శంఖచక్రాది ధారణంచోర్ధ్వ పుండ్రకం। ఉపవీతం శిఖాబంధం
విప్రస్యసతతంస్మృతం। చక్రధారణహీనస్య ద్విజత్వంనిష్ఫలంభవేత్
అచక్రధారిణంవిప్రం యశ్శ్రాద్ధే భోజయేన్నరః। రేతోమూత్ర పురీ
షాది సపితృభ్యః ప్రయచ్ఛతి। శంఖచక్రోర్ధ్వపుండ్రాదిరహితో బ్రాహ్మ
ణాధమః। జీవన్నేవసచండాల స్సర్వకర్మబహిష్కృతః। చక్రసంస్థా
నహీనస్య ద్విజత్వం నిష్ఫలంభవేత్॥ సీ॥ జుట్టనుజంజంబు చుట్టవా
ల్యంఖంబు ♦ ద్వయమంత్రపఠనంబు దనరదేని। విప్రుంకు వెంటనే వి
ప్రత్వమునుమాసి ♦ యపుడెచండాలత్వ ♦ మందుగాన। పైవాని వి
ప్రుండు ♦ పదపడిశ్రద్ధతో భరియింప వలయును ♦ వదలరాదు। చ
క్రాంకనవిహీను ♦ శ్రాద్ధభోక్తనుజేయుజనుఁడు రేతఃపురీ ♦ షముల
మూత్ర। గీ॥ ములనుపితరుల కిడినయ ♦ ట్టులనెజుండి। యవనిచక్రాం
క నవిహీను ♦ నఖిలకర్మ। గహితునిగ పరాశఖండయందు। వరుస
నధ్యాయమున రెండ ‡ వదియునైన। దానియందునవ్రాసిరి ♦ దవిలి

యిటుల ॥11॥ గీ॥ కానజట్టును జంజంబు ♦ కరణిగానె। యందరును హోమవహ్ని చ ‡ క్రాంకనంబు। గాంచవలయును నిత్యంబు ♦ గానుభక్తి। నిదియముక్తికి తోవయై యెసఁగుచుండు ॥12। (పరాశర స్మృతి) స్మృ॥ ప్రథమం తాపసంస్కారం తాపసైర్మునిభిస్స్మృతం। సర్వాశ్రమేషువసతాం స్త్రీణాంచద్విజసత్తమాః। అగ్నితప్తేనచక్రేణ బాహుమూలేతువాంఛితాః। తేయాంతి పరమంస్థానం పునరావృత్తివర్జితం।అగ్నినైవతుసంతప్తం చక్రమాదాయవైష్ణవః।దాహయేత్సర్వ వర్ణానాం విష్ణుసాలోక్య సిద్ధయే। దక్షిణేతు భుజేవిప్రో బిభృయాద్వైసుదర్శనం। సవ్యేతుశంఖం బిభృయాదితివేద విదోవిదుః। చక్రాంకితాయవిప్రాయ అభుక్త్వా న్నందదాతియః। తథన్నం మేరుతుల్యం స్యాదశ్నుతేదివిదేవవత్॥ సీ॥ ఈవర్ణమావర్ణ మేవర్ణమనకయే యాశ్రమభేద మం ♦ చనక యందఱు। రను వెలందులునైత♦ మునువహ్ని సంతప్త శంఖచక్రముల నా ♦ చార్యుచేత। వామదక్షిణములో♦ బాహుమూలములందు వరుసధరింపగా ♦ తిరిగిరాని। హరిపదంబును జేరె ♦ దరువారికిడిన యొక్కింతటియన్న మ♦ దెంతయేని। గీ॥ మేరుపర్వతతుల్యమై ♦ మేరమీఱ। యమృతమయి దేవతులుబోలె ♦ నను దినంబు। స్వర్గముననుండి గుడుతురు ♦ సౌఖ్యముగను. । యెల్లజనములు తిరముగా ♦ నుల్లసిల్లి ॥ 13 ॥ (ప్రసన్నధర్మసారసముచ్చయమున, పద్మపురాణము) స్మృ॥ అంకయేత్తప్త చక్రాద్యైరాత్మనోబాహుమూలయోః। కలత్రాపత్య భృత్యేషు పశ్వాదిషుచ సర్వశః॥ గీ॥ చక్రసంతప్తభుజులు వం ♦ శంబువారి। నెల్లరుచుభృత్యతతినెల్ల ♦ నెపుడుతన్ను। గొలుచు పసువుల చక్రాంకి ♦ తులఁగ జేయ। వలయు పాత్రలపై గూడ ♦ వ్రాయవలయు ।14॥ గీ॥ ఎవ్వరెవ్వారికేయగ్ని♦ యందుహుతము। జేసిచక్రాంకనంబును♦ జేయవలయు। నోగడయటన్నహారల ♦ నొప్పియున్న। నగ్నియందునఁ జేవలె ♦ హానిఁ దలఁచి। 15॥ చం॥ యతులకు నగ్గిలేకునికి ♦ నగ్నిసుతప్తము గానివాని దాల్పతగుదటంచు సత్స్మృతులు ♦ రాజిలుచుండుట లెల్లఁ జూచి తా। మతినిఁజెలంగి యిప్పుడిది ♦ మంచిగజేకురె నంచునెంతయో। సతత

ముఃగొంగిబొంగి మరి ♦ సభ్యవతంసులఁ బోలు వారిలో॥16॥ కం॥ కొందరు యతులకు నిదితగ। దందురు తమ గురుత కేమి ♦ హానియొ యనియా। మందులఁ బలుకులు మదినిడి। సందియ మందంగరాదు ♦ సభ్యవ తంసుల్॥ 17॥ చం॥ యజనము సేయువారు దమ ♦ యంతన శ్రీహరి నెంచుచున్నబు। ద్విజులు సమస్తకార్యముల ♦ వేసురకుండగ నల్పు రీతిశి। వ్యజనమువీరియానతిని ♦ నొదలఁ బూనుచు హోమవ హ్ని వే। దజమగురీతి సల్పియుట ♦ తప్తముఁజేసిన శంఖచక్రముల్॥ 18॥ గీ॥ శిష్యులందింప యతివరు ♦ ల్చేతఁబూని। భుజము లందిడి శిష్యులన్బ్రాజ్యులుగను। సేయుభాగ్యంబుఁ గలదెన్ను ♦ సేతనేని। దీనిగాదన్న పాపము ♦ ల్దీటుకొనవే॥ 19॥ గీ॥ కాన యతివరులబ్బని ♦ కాలమునని। బ్రహ్మచారులు మొదలగు ♦ వైష్ణవులనె। శ్రేష్ఠమగునట్టి సుజనుల ♦ చేతనపుడు। చక్రధారణ మదియంత ♦ సమ్మతంబు॥ 20॥ గీ॥ శ్రుతులు స్మృతుల విలేక నే ♦ సెప్పినంత। వట్టిమాటల నెట్లు చే ♦ పట్టవచ్చు। నరుచుబలికిన గొన్నింటి ♦ మనవిసేతు। గ్రంధ విస్తర భీతిచే ♦ దగిలియిపుడు ॥21॥ (నిర్ణయమహోదధియందు, పరాశరసంహిత) స్మృ॥ స్వాగ్నౌకురా ద్వ్యబ్రహ్మచారీ తప్తచక్రాదిధారణం। కుర్యాద్దేవాలయాగ్నౌతు సన్యాసీ హోమమార్గతః॥ గీ॥ బ్రహ్మచారియు గృహివాన ♦ ప్రస్థులు తమ। యగ్నియందున నింక ♦ సన్యాసిదేవ। రత్నసద్మాగ్ని హోమ పూ ♦ ర్వకముగానె। చక్రధారణమునుఁ బ్రీతి ♦ సలుపవలయు ॥ 22 । ఉ॥ ఈవచనంబులోన యతి ♦ యీహరి సద్మపువహ్ని వేల్చి శి। ష్యావళి చక్రధారణము నందగజేయఁగవచ్చునంట హో। మావసరంబు నన్యతికి ♦ నగ్ని స్పృశింపుట ధర్మమన్నత। ప్పావిధి హోత వేల్చగ స♦ సమాశ్రయణంబుచు జేయుటంతయున్ ॥23॥ గీ॥ హోతవిధిఁదీర్చి యందిచ్చి యున్న వాని। తోడ నైతము యతిసేయఁ గూడదనిన। దేవునికిఁగూడ యతులింక దీపధూప। ముల సమర్పింపఁ దగదంచు ♦ బలుకరాదే॥ 24॥ గీ॥ కాన యతులకె పంచ సంస్కారములను। జేయుట లనెక్కుడ హక్కతఁ ♦ జేరియుండు। నితరులకు నన్న ముఖ్యమై ♦ యిదియె మం

చి। సరణియని యెంచుడీయింక ♦ సరసులారా ॥24॥

మ॥ యతులగ్ని స్పృశియింప రాదనెడి వా ♦ క్యంబుం త చక్రాంకన। వ్యతిరిక్తంబున సార్థకంబగుననర్థ ♦ వాదేమి లేకుండ గానితరుల్వేల్చినయగ్ని దాపి యతికం ♦ దింపఁగ చక్రాంక నాం। చితులన్సేయుటతప్ప టంటలుని ♦ సీ పల్కరాదెట్టులర్థ ॥25॥ గీ॥ వారివారికిఁ దగినట్టి ♦ వహ్నియందు। వేల్చి చక్రాంకనము సేయ ♦ విహితమనుచు। యతివరులుఁగూడ దేవాల ♦ యాగ్నిహుతముఁ। జేసిచేయంగ వలెనని ♦ జెప్పుటయును ॥26॥ గీ॥ యతులకాచార్య పదవిలో ♦ నర్హతయును। నటులె చక్రాంక నంబులో ♦ నధికతయును। అగ్నినిర్ణయ మును జేయు ♦ నందువలన। యతుల కిందున నధికార ♦ మతిదృఢంబు ॥27॥ గీ॥ యతులు వేల్చక తాము ♦ ధూపాగ్నియందు। తప్తమునుఁ జేసి జేయుట ♦ తప్పటంచు। దేలుచున్నది తేటగా ♦ దీనివలన। గాన నటు సేయుచుండుట ♦ల్యాకాదు ॥28॥ గీ॥ హోమమార్గంబుతోనంచు ♦ వరలియుంట। దాని విడనాడి సేయుట లుప్పటంచు। దేలుగావున యతులును ♦ దేవతాగ్ని। హోమమును జేసియే జేయ ♦ యుక్తమగును ॥29॥ గీ। ఇంక యిదిబోనిచెప్ప నుం ♦ కించియున్న। దాని నింకయు వ్రాయనుం♦ కించినాడ। నేమియేమియు సంశయం ♦ బసఁగనేని। తెలవు వెట్టుడటన్న నా ♦ సభ్యవరులు ॥30॥ గీ॥ ఏమి వచనంబులో వీని ♦ నెపుడు గనము। భారతంబున నేనియు♦ భాగవతము। నందు నేనియు పొందింపు ♦ డన్న రెంట। గలుగు వానిని నేవ్రాయ ♦ గలనుసుండీ ॥ 31 ॥ ( వ్రి, స్న, చ్ఛయ, భారతమున॥ కృష్ణార్జున సంవాదము ) స్మృ॥ మచ్చక్రాంకిత దేహోయం మద్భక్తోభువిదుర్లభః। నైవాప్నోతి వశంమృత్యో రప్యాజ్ఞా భంగకృన్నరః। నాన్యందేవం నమస్కుర్యాదన్యదాయతనంవిశేత్। చక్రాంకితస్సదా తిష్ఠేద్భక్తితః పాండునందన॥ మ॥ ధరచక్రాంకితు లన్యదేవతల స ♦ న్మానించుటల్ జూచుటల్। సరిగాదంచు త్యజించి మేటి జమునా ♦ జ్ఞర్దోలఁగా దిట్టలై। కరువైయుండెద రట్టివార లిలనా ♦ కైంకార్యమందెప్పుడుర్। స్థిరచిత్తంబుగలారు గావలయుభ ♦ క్తిన్సర్వ కాలంబు

వ౽ ॥32॥ భాగ॥ అజామిళోపాఖ్యానమున ॥ శ్లో ॥ యేకంఠలగ్న తులసీనళినాక్షమాలా యేబాహుమూలపరిచిహ్నిత శంఖచక్రాః। యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రా స్తే వైష్ణవా భువనమాశుప విత్రయంతి ॥ చం ॥ వదనమునందు పుండ్రములు ♦ బాహువునందున శంఖ చక్రముల్। జెదరక కంఠమందుతుల ♦ సీనళినాక్షలహార సంత తుల్। గుదురిచియున్న వైష్ణవులు ♦ గూర్మి జరించినధాత్రి ధన్యలే। గదయనియాయముండె వలు ♦ క౽ మరి సందియమేమిసెప్పడీ ॥33॥ ॥ గీ ॥ అన్నిసరిగాని పూర్వంబు ♦ నందుచక్ర। ధారణంబున మిక్కలి ధన్యులైన। వారలెవ్వారలన్నను ♦ వారి వరుస ♦ స్కాందమున జెప్పి యున్నట్టి ♦ సరణిగనుడీ ॥ 34 ॥ స్కాందము ॥ నారద బ్రహ్మసంవా దమున ॥ శ్లో ॥ చక్రాంకిత భుజాస్సర్వే ప్రహ్లాదేన ధృవేణచ।మాంధాత్రాహ్యంబరీషేణ మార్కండేయ ముఖై ర్బుధైః। విభీషణేనబలినా శుకాస్యాంగద శుకేనచ। చక్రాదిచిహ్నితం సర్వం దేహం కృత్వా చపుత్రకా ॥ సీ ॥ బ్రహ్మనుగూర్చినా ♦ రదముని చక్రాంకనము నె వ్వరైరని ♦ నాడువేడ। అంబరీషవిభీష ♦ ణాదులుమాంధాతృ బలిశు కరుకాస్యాంగ ♦ దులును మఱియు। ధృవుడుమార్కండేయ ♦ ధీరుండువీరచే।నందరుమిగులనా ♦ నందమొంది। తమభక్తిచక్రాంక♦ నముబూని తమదేహ ములనెల్ల సార్థకం ♦ బులుగజేసి। రానిరటంచని నారద మునికిబ్రహ్మ। కొమరుడంచని యెంతయు ♦ గూర్మితోడ। దవిలి సెప్పె నటంచుస్కాం ♦ దబునందు। వెలయుచున్నది గాదెయో ♦ విబుధులార ॥ 35 ॥ అనిన ॥ గీ ॥ చక్ర సంతప్త భుజులెంత ♦ సభ్యులేని వారి ముఖమునుగాంచిన ♦ వారు నరక। మునమునుంగుదురను స్మృతుల్ గనరె మీర। లనినవివరింతు వానికి ♦ సర్వమిపుడు ॥ 36 ॥ చక్రాంకన నిషేధవచనగత్యంతరము ॥ గీ ॥ ఆదిత్యులైనంగ హేమాద్యాదులచక్రాంకనంబు ♦ నందిన ద్విజుమో। మాదరణానాదరమున।గా వనకన్గాంచిరేని ♦ కలుషముదెచ్చు ॥ 37 ॥ చం ॥ తెలియకగాంచి రేనియుమ ♦ దిన్వెతఁజెందుచు నర్కుసూర్యమం। డలము నమస్కరించి మది ♦ ధ్యాన మొనర్చియు వైష్ణవంపుసూ। క్తులవినుతింప నందునను

దూకొనుపాపము బోవులేనిచో। దొలగదు పాపసంఘమది । దోస
ముతప్పదు తప్పదెప్పుడున్ ॥39॥ చం॥ ఇవిమొదలైన మేటిస్మృతు ♦
లెన్నియొ భాసిలుచుండ నింక నై। ష్ణవత ఘటింపఁ జేయునది ♦ చక్రి
సమాశ్రయ ణంబటంచు మీ । రివియును గానఁ జేసితిరి ♦ యేమివెలి
నిక్రమటంచు మీమదిన్ । దవిలిన సంశయంబులిక ♦ తద్దయు బాయును
మున్నుఁ జూడుడీ॥ 40॥ చం॥ భుజముల తప్తచక్రములఁ ♦ బూనిన పా
రుఁడు రౌరవంబులో। నిజముగ తాబడున్మరియు నేరఁడు గడ్డను జేరనం
చునీ। యజువచనాళి కర్థమిది । యా గదనిక్రము లౌకాగ్నిలో। ద్వి
జలరు చక్రధారణము ♦ వీడుడటంచని దెల్పునింత యే ॥41॥ చం॥ అ
ది యెటులన్న ధాత్రిస్మృతు ♦ లన్నియు శ్రీహరిసేయునాజ్ఞలై। గదవి
లసిల్లు నిక్రమన ♦ గామరియిట్టులు వాని వానిలో। తుదిమొద లౌ
క్రరీతిగనె ♦ దూరక వేరొక యర్థమిచ్చునే । యిదితగవౌనె శ్రీహరి
యు ♦ నిట్లువచించునె మీరెసెప్పుడీ ॥42॥ చం॥ ధరణిని తప్తచక్రము
ల ♦ దాల్చినవారుల నిందసేయు శ్రీ। హరివచనాళి హోమముల ♦ నం
దనివహ్ని సుతప్తచక్ర రా। ద్ధరణము గూడదంచు విశ ♦ దంబుగ దేలు
నె లౌకికాగ్నిలో। నెరపిన చక్రధారణము ♦ నేరద నున్వచనాళి యు
న్నదే ॥43॥ అనిన॥ ( ప్ర, చ్ఛయ. నారదుడు ) స్మృ॥ హుతాగ్ని త
ప్తచక్రాద్యై రాయుధైః పంచభిర్హరేః। ప్రతప్త బాహుమూలా యే
ప్రాప్నుయుస్తే పరంపదమ్। లౌకాగ్నిషు సంతప్తైశ్చక్రాద్యైర్యదివాంఛి
తః। ద్విజాతయో మహారాజ ప్రాప్నుయుర్నరకం ధృవమ్॥ కం॥ హు
కివహ్ని తప్తచక్రాం। చితభుజులకు మోక్షమబ్బు ♦ చెడులౌకికతా
పితచక్రభుజులు మరియును। పతితుండగు నరకమునవె ♦ బాయక వొ
పుడున్ ॥44॥ ( ప్ర, చ్ఛయ, పాద్మోత్తరఖండ॥ 32 అధ్యాయమున )
స్మృ॥ హుతాగ్నినైవ సంతప్య సర్వపాప పనుత్తయే। చక్రంవా శం
ఖచక్రేవా తథాపంచాయుధానిచ । ధారయిత్వైవవిధివత్ బ్రంహక
ర్మసమారభేత్। హుతాగ్నితప్తచక్రేణ శరీరంయస్యలాంఛితం। తేనతీ
ర్థానియజ్ఞాంశ్చ సంప్రాప్తా నాత్రసంశయః । అధృత్వావిధినాచక్రం
బ్రాంహణోజ్ఞాన దుర్లభః।గర్హితస్సర్వలోకేషు బ్రాంహ్మణ్యాత్ప్రి

చ్యుతో భవేత్॥ ఉ॥ పాపచయంబు దోలుటకు ♦ బ్రాహ్మణు లెల్లరు హోమవహ్ని సం। తాపిత శంఖచక్రముల ♦ తప్పక రెంటనుగానిలేక యా। శ్రీపతి శస్త్రపంచకము ♦ చేతనెగాని విధిక్రమంబుగా। తాపిత దేహులై శ్రుతి వి ♦ ధానపు కర్మలఁ జేయఁగాదగుః ॥45॥ చం॥ విధి నొకయింత నెన్నిడక ♦ వేల్చినవహ్ని సుతప్తమైన యా। యుధమగుచ క్రలాంఛనము ♦ నొప్పినదేహము చేతయజ్ఞ తీ ♦ ర్థధునులవి యబ్బి నట్టులయె ♦ దాల్పకుఁడిందున సందియంబు వే। ర్వ్విధముగఁదాల్ప బ్రాహ్మణత ♦ వీడును నిందయుసేగివచ్చెడిః ॥ 46 ॥ ( ఆయుధ లోహ నిర్ణయము ) గీ॥ ధారణార్హంబులగు నాయు ♦ ధములనెట్టి। లోహములఁ జేయవలయు నా ♦ లోహసమితి। జనుల కెల్లరకును చాల♦ స రసముగను। దెలియునట్టులు శాస్త్రవి ‡ ధినివచింతు ॥47॥ ( నా,సంగ్రహమున ॥ పా చరాత్రము ) స్మృ॥ సౌవర్ణం రజతం తామ్రం కాంస్యమాయస మేవచ। చక్రంకృత్వాతు మేధావీ। ధారయేద్ద్వివిచక్షణః। ద్వాదశారం తుషట్కోణం వలయత్రయ సంయుతం। హరే స్సుదర్శనంనిత్యం ధారయే త్తద్విచక్షణః॥గీ॥ కనకరజితతామ్ర♦ కాంస్యంబులనువాని । లోన నేనిచేత ♦ నైనగాని । మూలలారుచుట్లు ♦ మూడునంచులునారు। వెలయు చక్రమూన ♦ వలయునరుఁడు ॥ 48 ॥ గీ॥ పయినఁజెప్పిన లోహంపు ♦ పటలివరుస। నాల్గు వర్ణములకు నవి ♦ నాలుగయ్యె। నింక నయిదగునిమ్మ ♦ నెపఁగియంత్య। జులకుత గునని పెద్దలు ♦ సూడవలయు ॥49॥ గీ॥ బ్రాహ్మణ క్షత్ర వైశ్యశూ♦ ద్ర జనములకు । స్త్రీలకును పశు పక్ష్యాది ♦ చేతనులకు । వైదికావైదికపు మంత్ర ♦ వర హుతాగ్ని । చక్ర ధరణంబె యంతకు ♦ సమ్మతంబు ॥50॥ గీ॥ చక్రధరణంబు నీరీతి ♦ సలిపి పిదప । గురుణభక్తియు నెంతయుఁ ♦ గొలుచుండ । నప్పుడాచార్య వరులె తా ♦ మంత్రయూర్ధ్వ। పుండ్రములఁ దాల్పఁజేయుచు ♦ బోదలవలయు ॥51॥కం॥ ఈగతిచక్రాంకన విధి । సాగించితినింక నామ ♦ సంస్కారంబుల్। వేగమె దిగ్దర్శనముగ। నాగన వ్రాసెదను గ్రంథ ♦ గౌరవ భీతిః ॥52॥ గీ॥ తండ్రిబెట్టిన పేరది ♦ దనరవేరె। పేరొసంగగవలయు నా ♦ పేరె

జెప్పి। కొనఁగవలె నెల్లడలను తా ♦ మనుజతతికి। గురువుబెట్టిన యా పేరె ♦ గొనగవలయు ॥53॥ గీ॥ మంత్రరత్నంబు ద్వయచర♦మము లె మొదలు। గలుగు మంత్రంబులను గూర్చి ♦ గదుర గురువు । శిష్యుల కు నుపదేశంబు ♦ జేసి పిదప। యాగవిధి నంతయునుఁజెప్పి ♦ యలర వలయు ॥54॥ గీ॥ పతికి పతిప్రీతి కర్మల ♦ కతిథులకును । అతిముదం బున సేవల♦నంతకంత। జాగరూకత జేయుటే ♦ సతులకంత।యాగమ నఁబడునని బల్కి ♦ రార్యవరులు ॥55॥ గీ॥ భగవ దారాధనంబును ♦ వైశ్యదేవ । మిదియె మొదలగు సత్కర్మ ♦ లదనులోన । సలుపుటయె యాగమనుచును♦సభ్యులెల్ల।పురుషతతికి బోధింత్రు ♦ ముదముతో డ ॥56॥ గీ॥ అవనివైశ్యులకును ♦ శూద్రులందరకును । స్త్రీలకెట్టుల నాపయి ♦ జెప్పఁబడెనో। అట్టులే మాకు సేయుట ♦ నర్హమగు న। టంచుఁ దెలియుటయే ♦ చాలమంచిదయ్యా ॥57॥ గీ॥ బ్రాహ్మణేత రులకు నెల్ల ♦ భక్తితోడ। హరికి భాగవతాచార్య ♦ వరులకెపుడు । సేవలను సల్పుటేచాల ♦ శ్రేష్ఠమయిన। యాగమగునింక వేరె య♦ య్యదియులేదు ॥58॥ గీ॥ వీనికెల్ల హోమ ♦ విధుల నంతయునల్లో। వీ నిఁజేయునట్టి ♦ విధులనెల్ల। వేరుగ్రంథములందు ♦ వెలయు చున్నవిగా న। గ్రంథవిస్తరభీతితో ♦ వ్రాయనైతి॥59॥సీ। తప్త చక్రాంకికు ♦ ల్ధ న్యులందరటంచు సామాన్యవచనము ♦ ల్బాలఁజూపి। వెలయుచు మీ దప ♦ రులకుమాత్రము హోమవిధియటంచు విశేష ♦ విధులఁ జూ పి। తప్త చక్రాంకన స్థాపనంబును దృఢ ♦ తమముగానిలిపి సం ♦ దె ములఁబాపి। చెలఁగినట్టుల నిష్ఠ ♦ షేధవచన। చయముతమ యర్థ ములఁదెల్పఁ ♦ జాలకుండు । నింత మేగాకచవిధి తా ♦ నంత నిర్వ ♦ హించుటను వీని బాధింప ♦ వింతయేని ॥60॥ కం॥ శ్రుతిస్మృతిపురా ణముల భా। రత భాగవతములని యల ♦ ప్రబలముగా స్థాపితమాట దీనిఁబొందిన। నతులిత మోక్షంబుగాంతు ♦ రందరుముడిగిరి ॥ 61 ॥ ఉ॥ ముక్తినిఁగోరువారు విధి ♦ పూర్వముగాను సుతప్త చక్రముల। భక్తిని బాహుమూలముల ♦ బాయక తాల్పక యెన్నియేని బల్। శ క్తికి మీరి జేసినను ♦ సర్వము భస్మహుతంబులౌనుబో। ముక్తిని గాం

చలేదు మరిమూఢుడు నై నరకంబులో బడుగ ॥ 62 ॥ గీ ॥ ఇది మె చకాంక నాధ్యాయ ♦ మిటుల నార। వదిగ శ్రీహాయవదను లే♦వ్రా యుం జేసె। దీనిగని పాప చయములం ♦ దెంపముక్తి। మార్గమును వేగగై కొండు ♦ మాన్యులారా ॥ 63 ।



శ్రీః.
శ్రీకురుమూర్తిః శ్రీనివాస ప్రసీద.
శ్రీహాయగ్రీవాయ నమోనమః.

# ప్రణవదర్పణము.

## పుండ్రాధ్యాయము. ( ౮ )

గీ॥ నాగురూత్తములను దొల్త ♦ నడుమ నాథ। యామునార్యులు కొన నశ్రీ ♦ హరి వెలుంగ। నిటుల వరుసగ భక్తియెం ♦ తేనిబొదల। గురుపంపర నెల్ల నే ♦ గొలుచువాడ.

ప్రపన్నానుష్ఠాన భాస్కరోదాహృతము ఋగ్వేద శృతిః ॥ ఊర్ధ్వరేఖం ప్రపదదా దూర్ధ్వలోకంయాంత్యం తే విష్ణుమియమిం దార్గ్నీ అవతంధియ। మదీయం దధానం మృదా దీర్ఘమాయుర స్మై యస్త్వం పురుషంభుజాపరంధీమహి ॥ గీ ॥ పొడువుగా రేఖలను గన్న పుండ్రములను। దేహమందున దాల్చినదిట్టతుదిని। యూర్ధ్వలోకంబులో నతా నుండుననుచు। జెప్పెఋగ్వేద శృతితాను♦చెలగియిటుల ॥ యజుశ్శృతి ॥ ధృతోర్ధ్వపుండ్రః కృతచక్ర ధారీ విష్ణుంపరం ధ్యాయతియో మహాత్మా। స్వరేణమంత్రేణ సదాహృదిస్థం పరాత్పరం యన్మహాతో మహాంతం।

॥ గీ ॥ ఎవఁడు హరిశంఖచక్ర చిహ్నితుఁడునగుచు। నూర్ధ్వ పుండ్రము
లనుఁ బూని యొప్పుచుండు। విష్ణు పరమాత్మ యంతయు ♦ వెలుగున
ట్టి వానిమాత్ర బుధులచును ♦ స్వరముగాను॥ 2 ॥ అథర్వణ శృతి ॥
హరేః పాదాకృతిమాత్మనో హితాయ మధ్యేఛిద్రమూర్ధ్వపుండ్రం ధా
రయతి। సపరస్య పి యోభవతి సపుణ్యభాగ్భవతి సముక్తిభాగ్భవతి॥
॥ ఉ ॥ హరిపాదాకృతి నూర్ధ్వపుండ్రములను ♦ ధ్యచ్ఛిద్రము లెవ్వరు
మా। విరినెవ్వఁడు హితంబుగోరి బకితిఁ దే ♦ దీప్యమానంబుగా। ధ
రియించుఁ ధరవాఁడు పుణ్యుఁడయి శ్రీ ♦ ధామాధిక ప్రీతికై। తిరమా
పాత్రముగా (దనర్చి యటను ♦ క్తిఁ జెందువేవేగమే ॥ 3 ॥ భల్లశా
ఖయందు ॥ శ్లో ॥ అర్చనాద్యా యజ్ఞమూర్తేర్ధృతోర్ధ్వపుండ్రో ద్విజో
త్తమః। కులంతారయతే సప్తగచ్ఛేత్పరమాంగతిం ॥ గీ ॥ యజ్ఞ మూ
ర్తికిఁ జేయుపూ ♦ జాదులందు। నూర్ధ్వపుండ్రంబు నేద్విజుం ♦ డొనర
దాల్చు। వాఁడు తనయేడు తరములవారితోడ। జేరు వైకుంఠపుర ము
చెచ్చెరనుఁ జెలఁగి ॥ పద్మపురాణమున ॥ శ్లో ॥ రుద్రః ॥ విమలాన్యూ
ర్ధ్వపుండ్రాణి సాంతరాళాని యోనరః। కరోతి విపులంతత్ర మందిరం
యః కరోతిసః ॥ బ్రహ్మాండపురాణమున ॥ శ్లో ॥ ఊర్ధ్వ పుండ్ర
స్య మధ్యేతు విశాలే సుమనోహరే। లక్ష్మ్యాసార్ధం సమాసీనోరమేశః
తత్ర నిర్వృతః ॥ గీ ॥ తెల్లని యూర్ధ్వపుండ్రముల ♦ దిద్దుచు నాన
డుము న్వెడల్పుచో। ట్లున జేయునట్టి సుజ ♦ నాగ్రణి యిల్లునుగట్టువాఁ
డయా। యిల్లున లక్ష్మితోసయిత ♦ మేను వసించెఁదగూర్మినంచు శ్రీ। వ
ల్లభుఁ డేవచించె నుధ్ధ్ర ♦ వంబుగఁ బల్కు లికేల సెప్పుడీ॥ 5 ॥ డిటో। పా
ద్మమున॥ ఈశ్వరుఁడు ॥ శ్లో ॥ ఊర్ధ్వపుండ్రస్య మధ్యేతు విశాలే సు
మనోహరే। లక్ష్మ్యాసార్ధం సమాసీనో దేవదేవో జనార్దనః। తస్మాద్య
స్యశరీరేతు ఊర్ధ్వపుండ్రం ధృతోభవేత్। తస్యదేహో భగవతో విమ
లం మందిరంశుభం ॥ చం ॥ మిగులవిశాలమైమనసు ♦ మెచ్చఁగనున్నట్టు
లమేనియందుము। ద్దుగను గుచ్చు నామముల ♦ తోరపుసందులలక్ష్మి
రొమ్ముల్లో। దగిలి చియున్న శ్రీహరియె ♦ తద్దయు నుండుట నూర్ధ్వ పుం
డ్రముల్। దగిలి వెలుంగు దేహమొక ♦ దా హరి కెంతయుఁ గూర్మి యిల్లు

గుక ॥ 6 ॥ చం ॥ సరిసరెమంచిమాట యిది ♦ శర్వుఁడు బల్కిన య ట్టుదేలదీ। శ్వరుఁడు వచించినట్టులని ♦ జంబుగఁ జూపుడటంచు బల్క గా। గలరెయసైన నట్టులనెగాఁ బ్రిలెడి ♦ స్కాందపురాణ వాక్యయం। బిరుపుగవాఁ బ్రియువాఁడనుగ ♦ దే నను కెంతయుగూర్మిఁ గాచుడీ ॥ 7 ॥ స్కాందమున ఈశ్వరుఁడు జెప్పుచున్నాడు ॥ స్మృ ॥ ఊర్ధ్వపుండ్ర వి ధానంతు వక్ష్యామిపరమం శుభం। సంపదా రోగ్యవిజ్ఞానం మోక్షప్ర దముమా సుత। కృష్ణా రక్తా తథాపీతా శ్వేతా మృత్స్నా చతుర్విధా కథ్యతే పురుషైః పుణ్యై ర్వైశ్వర్యా దిఫలార్థిభిః। పురావిష్ణు ర్హిరణ్యా క్షం వినిహంతుం మహాభుజః। వరాహరూప మాసాద్య సాగరానవిలో డయన్। కృష్ణా ఘోణార్థనాజ్జాతా రక్తా దంష్ట్రాగ్రఘాతనాత్। పా దైశ్చఖననాత్పీతా శ్వేతా కేసరచాలనాత్। కృష్ణా సంపత్ప్రదానిత్యాం రక్తారోగ్య ప్రదాభవేత్। పీతాజ్ఞాన ప్రదాప్రోక్తా శ్వేతామోక్ష ప్ర దానృణామ్॥ సీ॥ సంపదారోగ్య వి ♦ జ్ఞానమోక్షంబుల। నొసఁగజాలి నయట్టి ♦ యూర్ధ్వపుండ్ర। వితము నంతయు నీకు ♦ వివరింతు నోయు మా। సతినీకునీపయిఁ ♦ జాలగూర్మి। హరి హిరణ్యాక్షు బా ♦ యఁగఁ జేయ క్రోడమై♦యబ్ధిని ఘోణాది ♦ యంగములను। గలపంగ నాల్గువ। న్నెలమన్ను తనభక్తతతియూర్ధ్వ పుండ్రము♦ దాల్పఁబుట్టె। దానిలో నల్లనిది సిరి ♦దనుపు నెఱ్ఱ। నిదిసుఖంబులనిడు పచ్చ ♦ నిదియు దెంతొ। తెలివినిడు తెల్ల నిది మె ము ♦ క్తినొసంగు। ననుచు స్కాందంబులో శర్వుఁ ♦ డనియెసతితోడ ॥9॥ గీ॥ అడ్డముగబడువారు తా ♦ మడ్డము గనె। పుడమిఁ బయికెక్కు వారెల్లఁ ♦ బ్రొమపుగానె। చెప్పచుం దురు గావున నూర్ధ్వలోక। ములకుగోరెడి వారెల్ల ♦ నూర్ధ్వపుండ్ర। ములనుబూనుటయే యుక్త ♦ ముగ వెలుంగు ॥10॥ గీ॥ పయిఁ జెప్పిన వన్నెల ♦ ఫలములన్ని। ముక్తికెంతయుతమవానె♦ ముద మతోడ। వ లసిచేరుట నన్ని వ ♦ న్నెలనుపేడి। తెల్లనగు నుద్ధదాల్చుటే ♦ చెల్లు నయ్య ॥11॥ ॥స్మృ॥ ఊర్ధ్వంనయతి యత్పుండ్రం ప్రాశినాంపాప కా రిణాం। తస్మాత్ఖ్యా హ్యూర్ధ్వపుండ్రేతి తస్మాత్తం ధారమేద్ద్విజః। నా రదః॥ ఊర్ధ్వ గత్యా తుయస్యేచ్ఛా శదూర్ధ్వంపుండ్రముచ్యతే। ఊర్ధ్వ

గత్వాతు దేవత్వం సంప్రాప్నోతి నసంశయః ॥గీ॥ పాపులకు నూర్ధ్వలోక సంప్రాప్తినిడుట। నూర్ధ్వపుండ్రంబునాయది యొప్పచుండు। నిట్టికారణమెల్ల గన్పెట్టిబుధులు। నూర్ధ్వపుండ్రంబు దాల్చెద రొప్పుగాను ॥12॥ గీ॥ ఎవ్వఁడిల నూర్ధ్వలోకంబు నిచ్ఛయించు। వారలీయూర్ధ్వపుండ్రంబు గోరియిడుదు। రూర్ధ్వగతులకు దేవత్వ మొప్పియుంట। సందియం బొకయింతయు సలుపరాదు॥ 13॥గీ॥ఇట్టియీయూర్ధ్వపుండ్రంబు లెచటనెచట। దాల్పవలెనన్న దాని విధానమెల్ల। దెలియఁజేసెద నాశక్తి కొలఁదిగాను। ధన్యతములార నన్నుసద్దయనుగనుఁడీ ॥14॥ ( ఊర్ధ్వపుండ్రక్రమాదిని రూపణము) స్మృ॥ లలాటేభుజయుగ్మేతు పృష్ఠయోః కంఠకూబరే। ధారయేదూర్ధ్వపుండ్రాణిచతర గుళమాయతం। పృష్ఠేతు పార్శ్వయోః ప్రోక్తమాయతంతుదశాంగులం। బాహ్వోర్వక్షస్థలేపుండ్ర మష్టాంగుళముదాహృతం॥ గీ॥ ఫాలమునకుక్షుద్యరః కంఠ పార్శ్వములను। బాహుయుగమందులను కంఠ పార్శ్వములను। వీపుకకుదంబు ననునిటు వీక వరుస। నడుమ కుడియెడమల గాను యిడగవలయు ॥15॥ గీ। ఫాలమున భుజముల పృష్ఠ భాగములను। కంఠకూబరముల నాలు గంగుళములు। తగ దశాంగుళముదర తత్పార్శ్వములను। ఎనిమిదంగుళమును వక్షమున భుజముల ।16।స్మృ॥ ఏవంద్వాదశపుండ్రాణి బ్రాహ్మణస్సతతంధరేత్ ।తతత్పుండ్రేషుతన్మూర్తిం ధ్యాత్వా మంత్రేణ ధారయేత్। అంతరాళేషుసర్వేషు హరిద్రాం ధారయేచ్ఛ్రియం॥ శా॥ ఈ రీతిన్మదిరెండు పుండ్రముల విప్రేంద్రుల్ పయిన్బ్రానుచో। తారాచోటుల కేశవాదులగు మంత్రంబు ల్దరింపదగున్। ఆరంధ్రాళుల లక్ష్మియౌ పసపు తా మందందుమంత్రాళిచే। మేల్మీరెడి భక్తిదాల్పగవలెన్। మేలందఁగా నెప్పుడున్ ।17। ( వర్ణభేదమున పుండ్రసంఖ్య ) స్మృ। చత్వారిభూభుజాం ప్రోక్తం ద్వౌపుండ్రౌతు విశాంస్మృతం।ఏకపుండ్రంతు నారీణాం శూద్రాణాంతువిధీయతే।ఊర్ధ్వపుండ్రం లలాటేతు సర్వేషాం ప్రథమం స్మృతం। లలాటాదిక్రమేణైవ ధారణంతువిధీయతే॥సీ॥ ఈయూర్ధ్వపుండ్రంబు లెవ్వరెవ్వర దె

ట్లు। దాల్పగావలెనో యా ♦ ధర్మమిపుడు। తేటగావ్రాసెదఁ♦ దెలిసి
నయంతలో వచన సంతతులను ♦ న్వరలజేసి। బ్రాంహ్మణతతికెల్లఁ
బండ్రెండుఁజెప్పుచుఁ క్షత్రియులకు నెల్ల † నాల్గు వైశ్య। వరులకురెం
డు శూ ♦ ద్రులకు నొక్కటియల్లె సర్వవర్ణ స్త్రీల♦ సమతికొకటె।
ఫాలహృద్బాహు యుగముల ♦ బాహ్వివుండు। నొసటరొమ్మున వైశ్యు
లు ♦ నొసటియందె। స్త్రీలుశూద్రులు వరుస నీ ♦ రీతిగానె। దాల్ప
వలెనిదె ధర్మమై ♦ దనరుచుండు ॥18॥ గీ॥ అందరునుఁదొల్త ఫాలము
నందెదాల్చి।యవలవరుసగ నందంద ♦ యలరఁజేయ। వలెను వరుస
నువీడ రా ♦ దలసియేని। యిదియెగదయూర్ధ్వపుండ్రంబు ♦ లిడెడి
తోవ ॥ 19 ॥ ( ఊర్ధ్వపుండ్రాకార నిరూపణం ) స్మృ॥ మూర్తయో
వాసుదేవాద్యా శ్చతుఃపుండ్రేషుధారయేత్। ద్వాచగోవిందకృ
ష్ణౌతు ఏకంనారాయణం ధరేత్। ఎవంపుండ్రవిధిఃప్రోక్తస్సర్వేషాం
గిరిజేమయా। అశ్వత్థపత్రసంకాశం వేణుపత్రాకృతిం తథా। పద్మకు
ట్మలసంకాశం మోహనంత్రితియంస్మృతం। మహాభాగవతశ్శుద్ధః పుం
డ్రంహరిపదాకృతి। దండాకారంతువాదేవి ధారయెదూర్ధ్వపుండ్రకం॥
గీ॥ దొరలు శ్రీవాసుదేవ ప్ర ♦ ద్యుమ్నులను న। టులనెయని రుద్ధ
సంకర్ష ♦ ణులను వైశ్య। వరులు గోవిందకృష్ణు ల ♦ వనితలుచుప। ద
జులు నారాయణుని శ్రద్ధఁ ♦ దలఁచవలయు ॥20॥ గీ॥ రాగాకు గ
నెదురాకుగ। బాగుగ వికసిల్లనట్టి ♦ పద్మకియఁగా। నీగతి కూర్మిగ
లారలు। భాగవతుల్హరి పదంబు ♦ భాతిగనేఁగ ॥21॥ కం॥ దండా
కారంబుగనేఁ। నిండిన భక్తిని జెలంగి ♦ నిత్యంబును పం। డ్రెండు
నునాలుగురెండును। నొక్కటి నిటువర్ణరీతి ♦ నొప్పగనిడుడీ ॥22॥ గీ॥
ఇటుల పాద్మోత్తరంబున ♦ నీశ్వరుండె। యుమకు వచియించె ముప్ప
ది♦ యొకటియగుచు। నలరునధ్యాయమునచాల। యధికముగప్రపన్న
సారంబులోనిట్లు బలికినారు॥23॥గీ॥తమరుఁజూపినవచనసం♦తతులజూ
డ। సుద్దతో నూర్ధ్వపుండ్రముల్ ♦ సొగసుగాను। దీర్చవలెనంచు నెం
తయుఁ ♦ దెలుపసరియె। దవిలి శ్రీచూర్ణమేటికి ♦ దాల్పవలయు ॥
24॥ ( ప్రపన్నానుష్ఠాన భాస్కరమున ) స్మృ॥ బ్రంహ్మచారీ గృహ

స్థానాం యతీనాం వనవాసినాం। సువాసినీనాం కన్యానాం విధవానా మపిద్విజాం। శ్రీచూర్ణం సతతంధార్య మూర్ధ్వ పుండ్రస్య మధ్యతః । దీప్రదీపసమంధార్యం శ్రీచూర్ణం బ్రహ్మవాదినాం। అన్యేషాంతు క్షత్రియాదీనాం తింత్రిణీ దళసమ్మితం। అర్ధచంద్రాకృతిస్త్రీణాం ధార్యం పుండ్రంభుఘోరథః। తన్మధ్యే దీపవద్ధార్యం శ్రీచూర్ణం శ్రీప్రదంశుభమ్॥ గీ॥ బ్రహ్మవాదులు గొప్పదీ ♦ పంబువోలె। క్షత్రియాదులు చింతాకు ♦ సమముగాను। దాల్పవలయును తామంత ♦ ధన్యులయితి। మనుచు నెంతెంతయో గొప్ప ♦ హర్షమూని ॥25॥ గీ॥ అతివలెల్లరు నర్ధచం ♦ ద్రాకృతిగనె। కన్నుబొమ్మల క్రిందనే ♦ గలుగునటులె । సుద్దతోనిడియందున ♦ సొగసుగాను । దీపముగ సిరిచూర్ణంబు ♦ దిద్దవలయు ॥26॥ ( శ్రీచూర్ణ ప్రకరణము ) గీ ॥ ఇచట శ్రీచూర్ణమెఱ్ఱని ♦ దేయటంచు । శాస్త్రవేత్తలు శాస్త్రము ♦ లాన్తటుచుండ। గొందరందురుగద యది ♦ గూడదనుచు। గానవాసందెముల ♦ బాయగా లిఖింతు ॥27। గీ ॥ సిరినిఁ బోలిన వన్నెల ♦ నిగ్గులుకునట్టి। చూర్ణమిదిగానబుషులె శ్రీ ♦ చూర్ణమనెడి । పేరుదగుగాన నాపేరె ♦ బెట్టియుండ । వాదమేమైనఁ గలదె వి ♦ ద్వాంసులారా ॥28॥ ఉ॥ సిరికిన్నలినవన్నె యిట్టిదనుచు ♦ చిత్తంబు లోనెంతసు। స్థిరతన్జెందిన నప్పుగాదె మఱియు ♦ శ్రీచూర్ణవర్ణంబు నీ। తెరఁగేయంచుననిశ్చయం బొదవ్వగా♦ దేగాన శ్రీవన్నెని । బ్బరమొప్పారగ వ్రాయఁబూనితిని బో ♦ ప్రాజ్ఞోత్తము లెచ్చగా ॥29॥ గీ॥ ధరణిజనులందు మిగుల సౌందర్యయుతులు। తెల్లగానెఱ్ఱగానేని యు♦ల్లసిల్లు। గలరు పచ్చగ నెవ్వరుఁ గానఁబడరు । వదలి పాండువు రోగంబు వానిదక్క ॥30॥ గీ॥ శ్రీచూర్ణము తెల్లనిదని ♦ యేచాయ న్గానఁబడదెయిక పచ్చది నా। యాచాయ లక్ష్మికబ్బునె । యోచింపగనంచుమున్నె ♦ యొనరఁగ లేదె ॥31॥ గీ॥ సిరికిఁగల్గిన వన్నెచేఁ జెలఁగునదియె। యవని శ్రీచూర్ణమనుట లెం ♦ దైనఁగలదె। తమరు సెప్పినయదియ వే ♦ దంబెసెపుడి। యనఁగ వివరంతు నెంతయు♦ నారయనఁగ ॥32॥ ( ఖగప్రశ్న సంహిత ) ఊర్ధ్వపుండ్రస్య మధ్యేతు

రజనీచూర్ణముత్తమం। లక్ష్మీరూపం ధరేనిత్య మన్యద్ద్రవ్యం నవిక్షిపేత్ ॥ గీ॥ లక్ష్మిరూపంబుఁగల హరి ♦ ద్రను జెలంగి। యూర్ధ్వపుండ్రములకు మధ్య ♦ నొనరఁజేయ। వలయు రెండవ ద్రవ్యంబు♦ వదలవలయు। ననదె ఖగప్రశ్నసంహిత ♦ యలరియిపుడు ॥33॥కావున॥ గీ॥ సిరిపడంతుక వన్నెనే ♦ జెప్పవలయు। అన్య ద్రవ్యంబు దాల్పరా ♦ దనుటలక్ష్మి! వన్నెకన్నను వేరగు ♦ వన్నెగలుగు। దానిఁద గదంట మిగుల త ♦ ధ్యంబుగాదె ॥34॥ ఉ॥ సిరికింగల్గిన వన్నెగల్గినదియే ♦ శ్రీచూర్ణమానంట సు। స్థిరతంజెందుటచేత నెజ్ఞనగునా♦ శ్రీచూర్ణమేదాల్పగా। నిరవౌనంచువచింప సందియ మొకింతేనిన్మదిందోపదో। కరుణాగ్రేసరు లార యెజ్ఞనిదె యుక్తంబంచు వేదాల్పుడీ ॥35॥ శా॥ ఏమేమియిటులేల బల్కఁగల రెం ♦ తేనోరునవ్వంగనీ। మేమాయీపెడయుక్తులన్గొలిపి బూ ♦ మెజ్ఞాపనాగొట్టి మా। నేమంబు ల్విడనాడువారము శుభ్రితు ♦ ల్నెరొప్పప్పగాజూపుడీ। యామీదన్పరికింత మంచనగలా ♦ రాజూడుడీ సచ్ఛ్రుతుల్ ॥ 36 ॥ శ్రీసూక్తమువ, (శ్రు, ) పద్మేస్థితాం పద్మవర్ణాం త్వామిహోపహ్వయేశ్రియం॥ ఉ॥ పద్మమునందెంతయును ♦ జాయనికూరిమినుంచిదానినే। సద్మముగా గుదుర్చికొని ♦ చాలక వన్నెనుగూడ యెప్పుడుఁ। పద్మముగాఁ దనర్చు హరి ♦ భామిని నిన్నెడలంతు నెమ్మదిన్ ॥37॥ ( పు।సూ )చంద్రసూర్యాగ్ని వర్ణాభ్యాం శ్రీమహాలక్ష్మీముపాస్మహే॥ కం॥ ఇలచంద్ర సూర్యవహ్నికి। గలవన్నెల కెంతయేని ♦ గాలూనపు వెలుంగుల భాసిల్లెడు లక్ష్మినిఁ। దలఁచెదదని వారనట్టి ♦ తద్దయుభక్తిన్ ॥38॥ ( సూర్యునివన్నె నిరూపించుటకు ) ( సుందరకాండ ) తస్యజాంబూనదమయై శ్శృంగైస్సద్య స్సముత్థితైః। జాతరూపమయైశ్శృంగైర్భ్రాజమానై స్స్వయంప్రభైః। ఆదిత్యోదయసంకాశైరాలిఖద్భిరివాంబరం। ఆకాశం శస్త్రసంకాశమభవత్కాంచనప్రభమ్॥ గీ॥ అపుడుబుట్టిన సూర్యుని ♦ ననుకరించు। నట్టి బంగారు గోపురా ♦ లట్టివెలుఁగ। శస్త్రములఁబోలె నల్లనౌ ♦ చదలుతాను। రంగు బంగరు రూపమై ♦ రక్తిఁజెందె ॥39॥ ( భారతము) పరిమండ

లయోర్మధ్యే మేరుః కనకపర్వతః। ఆదిత్యతరుణాభాసః విధూమఇవ పావకః॥ కం॥ పరిమండల నడుమన భా। స్కరతరుణియుంబోలె పొగను ♦ గాంచకయెంతో। వరలెడు నగ్గియుబలె బం। గరుమల విలసిల్లు నెపుడు ♦ కాంతుల కిరవై ॥40॥ గీ॥ నల్లనగుమిన్ను తనవైన ♦ నలుపువిడిచి। యుదయసూర్యుని వన్నెతో ♦ నొప్పుచుండు। రంగుబంగారమగు గోపు♦ రములకాంతి। తాను బంగారురూపమై ♦ దనరెననిన॥ 41॥ గీ॥ ఉదయమగు సూర్యుఁడెట్లుగా ♦ నొప్పుచుండు। నితనిరుపమేయ కోటిలో ♦ నిచటనిపుడు। మించు బంగారమును వచి ♦ యుంచియుంట। పుత్తడియు సూర్యుఁడును నెరు♦ పుగనదేలు ॥42॥ గీ॥ కాన బంగరు పొడ్డగ్గి ♦ కాంతులెప్ప। డెట్లుగానుండుననిరొ బో ♦ నంచవలనె। ఇందు సందియమొక్కంత కే జెందబోదు। మందులకు నైన గాని యో ♦ మాన్యులారా ॥43॥ గీ॥ అగ్గియెట్లునిదనిఁ జెప్పన♦ నవసరమె। యందజెట్లునిదేయంచు ♦ నరుటవలన। శవముఁగాల్పగ నొక్కొక్క ♦ సమయముననును। మాత్రమును పలువన్నెలై♦ మందుగాని ॥44॥ వ। ఇంక తేలిన సారమేమనగా. గీ॥ వసుధ శ్రీచూర్ణమన సిరి ♦ వన్నెగలది। యని ఖగప్రశ్న సంహిత ♦ యనియె లక్ష్మి। పద్మసూర్యుల వన్నెతో ♦ ప్రబలియుంట। యెట్లునిదియంచు శ్రీసూక్తమిపుడుదెలిపె ॥45। కావున. గీ॥ సిరినిఁబోల్చిరి తిగ్మర ♦ శ్మికిగడంగి। తిగ్మరశ్మినిఁ బోలిన ♦ దేవితోడ। సరిగఁజెప్పిరి శ్రీచూర్ణ ♦ సిరినిగాన। ఇంక శ్రీచూర్ణమెట్లుని ♦ దేనిజంబు ॥46। అనిన ప్రతికథులు. ఉ॥ ఎంతలు సెప్పితేమియిటు ♦ లెన్నియొ యూహలఁ జేసియుంతకే। సంతసమందు వారలమె ♦ చాలునుమాటలు వేయునేల యొ। కొంతగ నెట్టివన్నెగల ♦ దే సిరిచూర్ణమటంచు దెల్పు వా। కస్వంతతిఁజూప మెత్తుమన ♦ కారుణికోత్తములార గాంచుడీ ॥47॥ ( నిర్ణయమహోదధిలో, బృహద్బ్రహ్మ సంహిత ) స్మృ। శ్వేతంపీతం తథారక్తం ద్రివ్యస్తు త్రివిధంస్మృతం। పుండ్రాణాం ధారణేనిత్యంమమైవ ప్రకటీకృతం। శ్రీకుంకుమేతి విఖ్యాతం సదామాంగలికం మునే। పుండ్రాణామంతరాళస్థం భక్తిదంమునిసత్తమ॥ గ। ఊర్ధ్వపుం

డ్రములనుఁదాల్ప ♦ యోగ్యమనఁగ । దగినమంత్రిని మూఁడు వి ♦ ధములఁజెప్పి। నాడ మీఁదటవానికి ♦ నడుమనెఱ్ఱ। నయిన నావన్నెకుంకుమ ♦ యనెడిదాని ॥ 48 ॥ గీ ॥ సర్వశుభముల నొసఁగఁగ చాలుదాని। లచ్చికెంతయు ప్రీతినే ♦ యిచ్చుదాని। భక్తి ముక్తుల నిచ్చుచు♦ ప్రబలుదాని। ధన్యులందరు తామెచ్చ ♦ దాల్పవలయు ॥49॥ గీ॥ ఇంను నెఱ్ఱనివన్నెచే ♦ నెసఁగుదాని। కుంకుమంబను పేరుచే ♦ కొనినదాని। గౌరియిడుడన్న నెఱ్ఱని ♦ కుంకుమంబె। దాఁలుపుడటంచు తేటగా♦ దేలదొక్కో ॥50॥ ( ని, మ, బృహద్బ్రహ్మ ) స్మ్రు॥ లలాటాదిషు చాంగేషు రుగ్భిస్తాభిః క్రమేణవై। నామభిః కేశవాద్యైశ్చ సచ్ఛిద్రాన్యేవధారయేత్। శ్రియైజాతేతిమంత్రేణ కుంకుమం తేషుధారయేత్ ॥గీ॥ మంత్రముల కేశవాది నా ♦ మముల నుచ్చ। రించుచును ఫాలమాదిగా ‡ నెంచబడిన। అంగముల యందుఁ దాలిచి ♦ యందు కుంకు। మంబు నటఁదాల్పవలయు శ్రీ ♦ మంత్రమునసే ॥51॥ ( ని, మ, ది॥ పరాశరసం॥ శ్రు॥ విష్ణ్వర్పితం రక్తవర్ణం హారిద్రా చూర్ణముత్తమం। లక్ష్మీనివాససిద్ధ్యర్థం దీపాకారం సుసూక్ష్మకం। ఊర్ధ్వ పుండ్రస్య మధ్యేతు లలాటే ధారయేద్ద్విజః॥ గీ॥ లక్ష్మి తనయందు నుంటకై ♦ రక్తవర్ణ। మయినకుంకుమ పుండ్రము ♦ ధ్యమున దీప! మునకు సమతగునట్లగా ♦ ముఖమునందు। విష్ణుశేషంబు నేదాల్చి ♦ వెలయవలయు ॥ 52 ॥ ( ప్రపన్న ధర్మసారన ముచ్చయము ) భరద్వాజసంహిత ) స్మ్రు॥ హారిద్రేణతు చూర్ణేన కుంకుమేన సుగంధినా। ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు లలాటే ధారయేద్ద్విజః॥ గీ॥ మంచి పరిమళములచేత ♦ మించు పసపు। చేతఁజేసిన కుంకుమ ♦ చెలఁగిఫాలమందు ధరియించి లక్ష్మికి♦ మందిరముగఁ। జేయుటే వైష్ణవులకెల్ల♦ న్యాయమయ్యె ॥53॥ గీ॥ పైన కుంకుమ పసుపు సం ♦ బంధమనియు। రక్తవర్ణమటంచని ♦ రాణజెప్పి। యుండుటనుజూడ సందియ♦ మొందకుండ। నిలను శ్రీచూర్ణమెఱ్ఱని ♦ దే నిజంబు ॥54॥ గీ॥ ఇందు ద్విజులకు ననివ్రాత ♦ నెంచిచూడ। శూద్రులకు పచ్చనిదియంచు♦ మాటిగాను । దేలుచున్నది గాన నో ♦ ధీరులార। శూద్రులకు పచ్చని

ది దాల్ప ♦ శుభము లొసఁగు ॥55॥గీ॥ పయినకుంకుమ పసుపుసం♦ బంధమనియు। రక్తవర్ణమటంచని ♦ రాణఁజెప్పి। యుండుటనుఁ జూడ సంద్రియ ♦ మొుదకుండ। నిలను శ్రీచూర్ణ మెత్తనిదే నిజంబు ॥56॥ అనిన ప్రతికక్షులు. కం॥ అన్నియు నొప్పగవల సే। యున్నట్టులఁ దోచుగాని ♦ యొప్పదు మనసే। మన్నను టంకరహితం। బెన్నటికే నెక్కసగునె ♦ యది మకుగగు నే ॥57॥ అనిన. కం॥ టంకణము మైలయనియే। వంకన్ననలేదెయట్టి ♦ వాదమెసరి నా। టంకణ యుతమగు పుస్తెల। గొంకొక తాదెంపవలసె ♦ కూర్మిమగండే ॥58॥ ఇదియునుం గాక. సీ॥ శ్రీసతీమణికి సం ♦ ప్రీతినిచ్చెడినట్టి కుంకుమార్చనములే♦ వంకజనునొ। ఐదువలకు కుంకు ♦ మాంచితులను వ్రాతలవియెల్ల నింకయే ♦ యడవిఁజనునొ। విప్రులుహోన్న ప ♦ విత్రము ల్బాబనుట నింక యచ్చోటికి ♦ నెసఁగిజనునొ। కులకాంతలెల్ల గ ♦ జ్జల పట్టెడలుబూని మెరయుటలెల్లనే ♦ మేరజనునొ। మయిల టంకణమని యొక్క ♦ మాటుదలఁప। పడతులకు కుంకుమంబును ♦ దుడువ వలసె। సుదతిపుస్తెలఁదెంపియే ♦ జూడవలసె। నన్ని విపరీతములగా నె♦ యెన్నవలసె ॥59॥ ( నిర్ణయమహోదధి, బృహద్బ్రహ్మసంహిత) స్మృ॥ హారిద్రాసంభవంచూర్ణం టంకణేన సమన్వితం। భావయేదామ్లద్రవ్యేణ రక్తత్వముపజాయతే। సంస్మృత్య పరమాందేవీం కమలాం మమ వల్లభాం। పూజార్థం మమదేవేశి వైకుంఠ ప్రాణవల్లభే। అజ్ఞాందేహి మహామాయే శ్రీచూర్ణం సాధయేయధా॥ సీ॥ వైకుంఠునకు ప్రీతి♦ వల్లభ వైనయోతల్లి నీసేవకై ♦ తద్దచెలఁగి। శ్రీచూర్ణమును ప్రీతి♦ సేయింపుఁడనినాకు। ప్రాణవల్లభఁ డిమ్మ। భక్తివేడి। పసుపు పుల్లనినీటఁ బడవేసియంతయు ♦ మునుగునట్టులఁ జేసి ♦ ముదముతోడ। అందుటంకణముఁ జె ♦ న్నొందఁజేరిచి యదియెఱుపైనదాకయూ ♦ స్థలినునుంచి నీడనెండించి చూర్ణంబు ♦ నెగడజేయు। డని బృహద్బ్రహ్మ సంహిత ♦ యలరఁజేసె। నాదియుంబున్న నదియేమొ ♦ శలవుఁబెట్టు। డింక కొన్నటి వ్రాసెద ♦ నిట్టివాని ॥ 60 ॥ అందుననే ప్రకారాంతరము॥ స్మృ॥ భావయేదామ్లద్రవ్యేణ శుద్ధనింబోద్ధవేనచ। అర్ధపిష్టేనవాప్య

త్రి టంకణం పాతయేద్బుధః । దత్వా చైరండపత్రాణి ముఖేమారుత వర్జితే। ప్రదేశేస్థాపయేచ్చైవ ద్రాక్షత్వముపజాయతే। తావద్విధూపయేన్నిత్యం యథాచ్ఛాయా నసంక్రమేత్ । సుగంధ స్నేహతైలేన భావయేచ్చందక్రేణవా। దేవ్యాఃప్రీతికరం చూర్ణాంనిష్పన్నంజాయతేయది। యావత్సంపద్యతేగంధ శ్రీచూర్ణే కమలప్రియే॥ సీ॥ పసుపుతుంటల నిమ్మ ♦ పండ్లరసంబుచేగాని పుల్లని మాడ్గి ♦ కాయరసము। చేగానిమునిగించి ♦ చెచ్చెర వెలిగారమందున తగురీతి ♦ నందఁజేసి। యేరండపత్రంబు ♦ లిడికొన్ని దానిలోనెట్టని వన్నెచే ♦ నెసఁగుదాక। యట్టులనేయుంచి ♦ యటమీదబాగుగా నెండగాలియులేక♦ యెసగఁజేసి। పచ్చికర్పూరమేగాని† పరిమళంబు। నిచ్చునేదియె గాని యె ♦ కింతయుంచి। జేసియున్నట్టి యదియబో ♦ సిరులనొసఁగు।-చూర్ణమని హరిలక్ష్మినిఁ ♦ జూచిపలికె ॥61॥ కం॥ కొన్ని వచనములను దాని ♦ వన్నెయిట్టి। దనుచుఁదెలుపకయే హరి ♦ ద్రనుధరింపు। డనగనట హారిద్రాపదం ♦ బునకురక్త। వర్ణమగు హారిద్రయటంచు ♦ వరలునెపుడు ॥62॥ చం॥ అనిన హారిద్ర మెట్టనిది ♦ యానన్ఁజెప్ప దరంబెయన్నపై। గనబడు సచ్ఛ్రుతిస్మృతులఁ గల్గినయర్థమదెట్లనంచు దే। లెనుగదవానికెంతో ♦ విపరీతముగా శ్రుతులుండునొక్కొ యుండినయెడనన్నివాంట్ల కొక ♦ ఠేయగునర్థము జొన్పుటొప్పదే ॥ 63 ॥ గీ॥ గ్రంథములవైపరీత్యంబు ♦ గానఁబడిన। నన్నిటికి నొక్క ఠేయగు♦ నర్థములను। కల్పనముసేయు టొప్పదే ♦ ఘనులకెల్ల । నదియెగాదొక్క సెపుడువ్యా ♦ ఖ్యాన గరిమ ॥64॥

ఇదియునుంగాక. గీ॥ పసుపు రెండు విధఁబులై బరిఢ విల్లు । రక్తవర్ణంబు పసుపున ♦ ర్ణంబటంచు। ర_వర్ణంబు మైసూరి రాజ్యమందు। గోరి బిదనూరు చెంగటఁ గూడపండు ॥65॥ సీ॥ కృష్ణానదికి చెంత కెరలు దత్తాత్రేయ కరుణనెంతయు వృద్ధి గాంచుచుండు। అవిగదా యిపుడుమ ♦ హాలక్ష్మి కొల్లాపురంబు నావెలుగున ♦ రాజధాని యారాజధానిలో ♦ నలరుచునుండు గా నచటనుండెడి భూమి♦యందు చాల। ఫలియించు రక్తిమ ♦ పసుపది మెండుగా నదియెందరో జె

ప్ప ‡ వినినవాఁడ। గాంచియున్నాఁడ నద్దానిఁ ♦ గన్నులలర। గానయె
ట్లనిపసుపును ♦ గలిగి యుంట। వాదమేమియు లేదని ♦ ర్వాదమేను
॥ ఉ ॥ కావున నెంతఁ జూచినను ♦ గాదనఁజెప్పఁడు శ్రీశుప్రీతికై। తా
వలమైన సజ్జనులు ♦ దాల్పవలెన్ గద యూర్ధ్వరేఖపుం। డ్రావ
ళి శాస్త్రసిద్ధమను ♦ నట్టిదియా సిరికుంకుమంబెమం। తా్రవళి సంస్మ
రింపుచు మ ♦ హావిభవంబున నెల్లకాలమున్ ॥67॥ (ని, మ, ది, ప
రా, సం, ) స్మృ॥ ఊర్ధ్వపుండ్రస్యమధ్యేతు రజనీచూర్ణముత్తమం।
తత్పుండ్రం నిష్ఫలంనీచం నిశ్రీకంనిధనావహం॥ శా॥ శ్రీచూర్ణంబది
యెట్టిదేయనుచు నీ ♦ రీతినన్నమర్థింపుచు। న్శ్రీచూర్ణంబును బూనకుం
డుటలు ని ♦ శ్శ్రీకంబునున్వ్యర్థమున్। నీచంబున్నిధనావహంబనుచు
నెం ♦ తేదేలగా నెట్లనొ। శ్రీచూర్ణంబును వీడువాని ముఖమే ♦ భీ
జూడరా దెప్పుడున్ ॥68॥ గీ॥ ఔర మీరిట్లు బలుక నే ♦ మందుమిం
క। నన్నుఁజెప్పక పసుపును ♦ వరదాల్పు। డనుచు నేలకో వచనము
లనియెకొన్ని। యనుచు మామదిలో సంశ ♦ యంబుఁగలదు। దానివే
వేగ మీరుపో ♦ దట్టుడనిన ॥69॥ ఏమేమీయిటు ప్రశ్న సేయతగవో ♦
నేమీరలీ మమ్ములన్ । దామేరీతి వచించుచుండెదరొ య ♦ ట్లాని
న్మదిన్జూడుడీ। యీ మీ ప్రశ్నకు యుక్తులన్నియును మీ ♦ కే దోచ
దే మాన్యులా। రా మమ్మేల శ్రమింపఁ జేసెదరొ య ♦ య్యాన్యమైనఁ
జెప్పెదన్ ॥70॥ స్మృ। పుండ్రాణా మంతరాళేషు హరిద్రాం ధారయే
చ్ఛ్రియమ్॥ గీ। పుండ్రములమధ్య నెల్లరె ♦ ప్పుడును పసుపు। దాల్ప
వలెనను స్మృతుల సం ♦ తతులవెలయు। చుండుగదవాని దమరుగాం
చుచునునట్టి। క్రమముగానిష్ఠ వర్తింపఁ ♦ గలరె సెపుడీ॥71॥ ఏలయా
నిన. గీ॥ రాతిబలెనున్నయీహ ♦ రిద్రను చెలంగి । పిండిసేయకయే
దాని ♦ నుండినటులె । చేతిలో రుద్దిదాల్తురే ♦ చేయిఁతూటు । బడని
యట్టులనీ మీప్ర ♦ భావమెసఁగ ॥72॥ గీ। కాన వచనాంత రముల
ను ‡ గాంచిమీరు। చూర్ణమును సేయుటయెచాల ♦ సుఖమటంచు।
నట్లు సేతురు పైవాక్య ♦ మందుగలదె। యానతీయుఁడు వేగమ ♦ యా
ర్యులారా ॥73॥ ఇంకొకటియును. గీ। పసుపుపొడిసేసి యదియ శు♦

భంబటంచు। దానిమాత్రమె మీరలు ♦ దాల్తురొకొ। వేరెయొక
కొన్నివానిని ♦ వెలయఁజూచి ॥ పిండిగలిపినదానినే ♦ ప్రీతినిఁకుట
74 ॥ గీ ॥ ఇట్టు వచనాంతరములగ ♦ లట్టిచాని। మీరు గైకొంటి
రేనియా ♦ దాఁగానె। రక్తవర్ణంబుటంకణ ♦ రంజితంబు। ననెడి
స్మృతులనువీడఁగా ♦ నానెచెపుడీ ॥ 75 ॥ ॥ గీ ॥ పసుపెకుంకుమ
యగుగాన ♦ పసుపుఁదాల్పు। డనుచు సామాన్యముగ ♦ నెవ్వరైన
తాము। జెప్పినంతనమీద వి ♦ శేషవిధులు। గనకవారల మనసును ♦
గానకుండ ।76॥ గీ॥ చంపితమన్నట్టి వానిని ♦ జంపుడనుచు। శాస్త్ర
మున్నదియని విశే ♦ షములఁగనక। పురుషుఁబట్టిన పులిఁజంప ♦ బో
యి పురుషు। జంపఁ జంపినవాని హిం ♦ సింపఁగలరే ॥76॥ గీ॥ తప్పు
నడిచిన యెడలను ♦ తానుఁజెకుట। గాక వనమెల్లఁజెరిచెడి ♦ కపుల
బోలె। గ్రంథకర్తకు నపకీర్తి ♦ గంటుగట్టి। నెడుటమంచిది గాదం
చు ♦ జెప్పుటరుదే ॥77॥ గీ॥ పసుపె యెఱ్ఱదిగా ను ♦ న్న పసుపులో
న। పిండిమాత్రము గలుపుచు ♦ ప్రీతినిఁకుడు। పసుపు పచ్చగ నుండి
న ♦ పసుపుఁదెచ్చి। యెఱ్ఱగాజేసి దాల్పుటే ♦ స్మృతుల మతము ॥
78॥ అనిన ప్రతివాదులు. సీ॥ ఔనన్ని నిజమె యా ♦ చార్యులుపుఁ
డ్రసంస్కారంబుఁ జేసెడి ♦ సమయమునను। పసుపగువన్నెచే ♦ భా
సిల్లుదీనినే చెలఁగించి రనమాకు ♦ బలుక వెరతు। గానియాపుండ్ర
సం ♦ స్కారంబు తరిని యాచార్యవర్యులె యెఱ్ఱ ♦ నైనదాని। గూ
రిమినిడియుండఁ ♦ గొన్నినాళ్లు ధరించి దానిమానిన మర్త్య ♦ దాన
వులను। గనినయంతన సూర్యునిఁ ♦ గనఁగవలయు। దొడరితన దుష్టక
ర్మలఁ ♦ దూరవలయు। బట్టతోఁగూడ నీరాడ ♦ బారవలయు। వారి
ని గురువర్యులను మదిఁ ♦ దలపవలయు ॥ 79 ॥ ఉ॥ ఏమది సద్గురూ
త్తముల ♦ దెట్టులపుండ్రముఁ దాల్ప జేసిరో। నేమముతోడ దానివిడ♦
నేరగరాదెయటన్న నింక మే। మేమన శక్తి చాలదక భ ♦ క్తియటె
భస్మముఁ దాల్పరాదొకో। లేమియె భస్మధారణము ♦ శ్రేష్ఠమటం
చను వాక్యరాశికి ॥80॥ (ని, మ, ధి, అసంస్కృతాం
హరిద్రాంతు ముఖే లింపే న్నరాధమః ద్రవ్యాంతర విహీనాంతు ర

జనీం ఘరాయేత్తుయః॥ గీ॥ వేరుద్రవ్యాంబు గలయక ♦ వెలుఁగు పసుపు। గాని సంస్కార రహితంబు ♦ గానియెపుడు। దాల్చువాడికమరి నరా ♦ ధముడటంచు। నిపుడు వృద్ధహారీత సం ♦ హితవచించె ॥81॥
గీ॥ ఇందు ద్రవ్యాంతరవిహీన ♦ మిడఁగరాద। టన్న ద్రవ్యాంతరంబన్న ♦ టంకణంబె। దానిఁజేర్చని పసుపును ♦ దాల్చునాతఁ। డధముడని దేలుటనుదాని ♦ నంటరాదు ॥82॥ గీ॥ ఇట్టియర్థముగొనక వే ♦ రేమిజెప్ప। టంకణ యుతంబటంచును ♦ కుంకుమంబ। టంచునెట్టనివన్నెయ ♦ టంచుఁజెప్పు। వచనసంతతి గలయదే ♦ వాగులోన ।83॥
గీ॥ కాన ద్రవ్యాంతరమన టం ♦ కణమెగాన। దానిఁ జేర్చని పసుపును ♦ దాల్చువాఁడు। నీచుడనుటలు మిక్కిలి ♦ నిజమయ్యె కాన టంకణరహితంబు కాదుదాల్ప॥84॥
సీ॥ శ్రీనిగమాంత దే ♦ శికధృత శ్రీచూర్ణమదిపైడి వన్నెయంచ ♦ నిరిబుధులు। వైడికిగలవన్నె ♦ పచ్చనిదేయంచు మందులుపండిత ♦ మ్మన్యులహహా। తముదామెయెడద ని ♦ ర్ధారణంబునుఁ జేసి గురువులతోవిను ♦ గూడదనుచు॥ శిష్టులమనితాము ♦ భ్రష్టుతాటమె గాక యజ్ఞులనొందర ♦ నటులఁజేతు। ఘోర శ్రుతి స్మృతులందితి ♦ హాసవరములందు బంగారమెట్టని ♦ దానటంచు। బలుకటలుఁజూడ కన్నులు ♦ పచ్చనయ్యె। బోలు గురునింద యెట్లుల ♦ బోవునురక ॥ 85 ॥
బంగారు యెట్టనిది యనుటకు. ( ప్రపన్నానుష్ఠాన భాస్కరమున )
శ్రు॥ తస్యైహైతస్య పురుషస్య రూపం। యథా మహారాజతవాసః। యథాపాండ్వావికం। యథేంద్రగోపః। యథాగ్న్యర్చిః। యథాపుండరీకం। యథాసకృదిత్యుక్తం। సకృదిత్యే వహిచాస్య శ్రీర్భవతి॥ కం॥ పరమాత్ముని వన్నెకు బం। గరు నాద్రియను కాంతి ♦ పురుగులు పట్టుక। నెరుపునుఁబోల్చుట పుత్తడి। ధరయెగుపన సందియంబు ♦ గలదేనెపుడీ ॥86॥ ( పురుష సూ ॥ ) వేదాహమేతం పురుషం మహాంతం। ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్॥ కం॥ పరమాత్ముని వన్నియభాస్కరు బోల్చెను పురుషసూక్త ♦ కమునను సూర్యుం। డెరుపే పసుపగ లేడని। శిరివన్నెను వ్రాసినయెడ ♦ జెలగును గనుడీ ॥87॥ ఇది

యునుంగాక. గీ॥ అవని బంగారు పసిమిగా ♦ నలరునన్న। చెడ్డదని దానినందరు ♦ జెప్పరొక్కొ। గానబంగార మెట్టినె ♦ గాఁవలుగాని। పసుపు వన్నె యటంచని ♦ బలుకరాదు ॥88॥ వ॥ ఈవిషయమున వెనక లక్ష్మీస్వరూప నిర్ణయములో పెక్కులుగా వ్రాసినానుగాన నిందువ్రాయమానితిని. గీ॥ పసుపుకాళ్లకు పూతగా ♦ బరిఢవిల్లు। కుంకుమము ఫాలములయందె ♦ గుదిరియుండు। పాదములఁ దాల్ప యోగ్యమా ♦ పసుపునెల్లు। ఫాలముల దాల్ప వచ్చునో ? బలుకరయ్యా ॥ 89 ॥ వ॥ శ్రీ నిగమాంత దేశికులవారు రచించిన దేవనాయక పంచాశతులో దేవనాయకుల యూర్ధ్వపుండ్రంబును వర్ణించునపుడు, శ్లో॥ లావణ్యావర్జితలలాటతటే ఘనాభే బిభ్రత్త్రిగుణ విశేషమివోర్ధ్వపుండ్రం। విశ్వస్య నిర్జరపతే తమసావృతస్య మన్యే విభాయసి మాంగలికం ప్రదీపం ॥ గీ॥ మేఘములఁబోలె నల్లగా ♦ మించుదేవ। మేఘములయందు మించెడి ? మెరుపుబోలె। చీకటినిదోలు దీపంబు ♦ చెలువుగాను। నెగడు నీయూర్ధ్వపుండ్రంబు ♦ మిగులమెరసి ॥90॥ గీ॥ మెరుపుదీపంబు పసుపుగా ♦ మెలఁగుచుంచు। నెవ్వరేనియు జెప్పెద ♦ రే వచింపు। డెట్టనిదిగాదనియు వచి ♦ యింపఁగలరె। తామెజెప్పుదు నాయంకు ♦ దయఁదలిర్ప ॥91॥ ( దీపముకువన్నె, మాఘమున ) శ్లో॥ సాయంతన దీపపాటలాభిః॥ గీ॥ పొద్దుగునిగెడి వేళలో ♦ బాదలుచుండు। దీపములఁబోలె నించుక † తెలుపు నెఱుపు। గలసివెలసెడి నట్టియాకాంతి ♦ జల్లు। కందళీ కుసుమంబుల ♦ గాదఁద్చ్ఛ ॥92॥ గీ॥ అనుచుజెప్పుట కుంకుమ ♦ మంతయెఱుపు। గాదనర్చగవలె పిండి ♦ గలపవలయు। అదియె శ్రీచూర్ణమగుదాని ♦ హరికిభక్తు। లయినవారికిభక్తిప్రధా ♦ ర్యంబుసుండి ॥93॥ గీ॥ శ్రుతులనన్నింట కుంకుమ ♦ శ్రేష్ఠమనుట। శుభమటంచును బలుకుట ♦ బ్లాడ నశుభ। కాలమందునఁబూనుట ♦ ల్గాదటంచు। నవనినపర ప్రయోగంబు ♦ నందెయిటులు। అహరహంబున వీడిద ♦ శాహమునను। కొనసన ధరియింపుఁడి కమీరు ♦ కుంకుమంబ। టంచు నొకవాక్యమనుగాను ♦ పించియుంట। అశుభమందునతగదను ♦ నట్టుదేలు ॥94॥ గీ॥ కానదినిని యాశె

చ ♦ కాలమందు। నెవ్వరేగాని యుదుధరి ♦ యింపరాదు। పెద్దలాచా
ర మీరీతి ♦ బెరిగియుండు। గానవా శౌచమునదీని ♦ బూనరాదు॥
95॥ గీ॥ మాఖ్యమొక్కటి యేచాల ♦ మంచిదనుచు। నందరికినన
నేనెబో ♦ యధికమంచు। గర్వయుతులయి శాస్త్రమా ♦ ర్గంబు విడి
చి। సలుపువారల నొక్కింత ♦ దలంపరాదు ॥96॥ ఇంక తీర్మానము.
సీ॥ సిరినన్నుగల దాని ♦ ధరియింపుడితరంబు పనికిరాదని ఖగ ♦ పతి
శ్రుతిం బలుక। సిరివన్నెయెఱుపుదే ♦ స్థిరమని శ్రుత్యాదు లెంతొసామ్య
ములనొ ♦ క్కింతదెలుప। రక్తవర్ణపు హరి ♦ ద్రయుంబూనుడంచని
యాపరాశరులు తా ♦ మెత్తిబలుక। యెఱ్ఱనివన్నెచే ♦ నిలబుట్టు పసు
పును గలిగియుండునటంచు ♦ వెలసిబలుక। టంకణంబును జేర్చి ♦ కుంకు
మంజేసియే ధరియింపుడని బృహ ♦ ద్బ్రహ్మ బలుక। కుంకుమంబును
మీరు ♦ కోరందాల్పుడటంచు వృద్ధహారీతుండు ♦ నెత్తిబలుక। నితండ
టంకణము నుత్యజి ♦ యింపబలుక। యిచట పసుపెఱ్ఱనిది యంచు ♦
నెసంగిబలుక। మోచనలుసేయ ఫలమది ♦ యొప్పదురక। యిప్పడు
సంతోషమందుడిం ♦ కేమియలుక ॥97॥ కం॥ విడవుడు పసుపునుం
దాల్చుట। విడకుండిన స్మృతులంజూపి ♦ వెలయుదులేదా। యడుగ
న్నోపుడు గురువుల। తడబడియా శౌచముఖముం ♦ దాల్పగ నేలా॥98
కం॥ నెవ్వగలన్నియు దాదా। దవ్వులదోలుచును మీరు ♦ ధన్యతం
గనగా। నివ్వసుమతి నెఱ్ఱనిదై। నివ్వటిలెడి కుంకుమంబు ♦ నెనరునగ
నుడీ ॥99॥ కం॥ ధీరులెన్స్మృతులను జూపి ♦ దిట్టుడింక। తగినయుక్తిని
గాన్పించి ♦ తన్నుడింక। మాఖ్య మెల్లను వేవేగ ♦ మానుడింక।
మూకభావపు త్రోవలో ♦ బోకుడింక ॥100॥ ధరియింపుడు సద్భక్తి
ని। సిరిబలెనెఱుపైనయట్టి ♦ శ్రీచూర్ణము నే। స్మరియింపుండీగు ల
క్ష్మిని। నిరతము శ్రీహరికిప్రీతి ♦ నెగడుటకొఱకై ॥101॥ కం॥ ఇదిస్మృతి
శ్రుతి సమ్మతమగు। నిదిపెద్దల కెల్లచాల ♦ యిచ్చుముదంబుల్। ఇది
లక్ష్మికి శ్రీశునకును। తుదిలేని ముదంబు నొసంగు ♦ త్రోవధరిత్రిన్॥
కం॥ ఇది పుండ్రాధ్యాయంబను। నదియేడవది గనుభక్తు ♦ లందరు ద
నియన్। సదయుండయితనుదానే। గుదిరించుచు వ్రాయంజేసె ♦ గూ

ఓమి హారియే।




శ్రీః
శ్రీకురుమూర్తి శ్రీనివాస ప్రసీద.
శ్రీహయగ్రీవాయ నమోనమః.

# ప్రణవదర్పణము.

## పరతత్వాధ్యాయము. ( ౯ )

గీ॥ నాగురూత్తములను దొల్త ♦ నడుమ నాథ।యామునార్యులు కొన నశ్రీ ♦ హరి వెలుంగ। నిటుల వరుసగ భక్తి యెం♦ తేనిబొదల। గురుపంపర నెల్ల నే ♦ గొలుచువాడ.

( ర, త్ర, పరదేవతాపార మార్థ్యాధికారమున ) శ్రు॥ ఏకోహవైనారాయణఆసీత్। నబ్రంహ్మానచశంకరః। నారాయణాద్బ్రింహాజాయతే నారాయణాద్రుద్రోజాయతే। సప్రజాపతిఃపుష్కరపర్ణేసమభవత్॥ గీ॥ ఈశ బ్రంహాలలో నింక♦ యెవరుగారు। ఒకడెనారాయణుండెయంత ♦ కొప్పునతని। వలనఁబుట్టిరి బ్రంహరు ♦ ద్రులునువారి। లోననాబ్రింహాయాత్మ్మ ♦ లోనఁబొడమె ॥2॥ ( ర, త్ర, ప, దే, పా ) శ్రు॥ నారాయణాద్బ్రింహాజాయతే। నారాయణాద్రుద్రోజాయతే। నారాయణాద్ద్వాదశాదిత్యా రుద్రావసవస్సర్వాణిచ్ఛందాగంసి। నారాయణాదేవ సంపద్యంతే॥ గీ॥ వసువు లెనమండ్రు బ్రంహాలు ♦ బదునొకండు। ద్వాదశాదిత్యులటులె వే ♦ దములు బ్రంహ। రుద్రుఁడును వీరలెంతయో ♦ రూఢిబుట్టి। రధిపు నారాయణునివల్ల ♦ ననవె శ్రుతులు ॥3। ( ర, త్ర, ప, దే, పా ) శతపథ బ్రాంహ్మణే॥ శ్రు॥ సంవత్సరేకుమారోజాయత। సోరోదీత్ తంప్రజాపతిరబ్రవీత్। కుమారకింరోదిషి యచ్ఛమమ తపసోధిజాతోసీతి సోబ్రవీత్। అపహతపాప్మా అహమ

స్మి। హంతనామాని మేదేహీతి। తంప్రజాపతిరబ్రవీత్ । తస్యైతన్నా
మాకరోత్। అగ్నిస్తద్రూపమభవత్ । అగ్నిర్వైరుద్రః । యదరో
దీత్। తస్మాద్రుద్రఇతి। సోఽబ్రవీత్। జ్యాయాన్వా అహమస్మి । దేహ్యే
వంనామాసీతి। తంప్రజాపతిరబ్రవీత్। భవోఽసీతి । పశుపతిరసీతి । ఉ
గ్రోఽసీతి। మహాదేవోఽసీతి। ప్రజాపతిర్దేవాన సృజత తే పాప్మనా సందితా
అజాయంత। విరూపాక్షాయ దత్తాంతు బ్రంహణః పుత్రా యజ్యేష్ఠా
య శ్రేష్ఠాయ అమోఘాయ కర్మాధిపతయే సోఽబ్రవీత్ । వరంవృణా।
అహమేవ పశూనామధిపతి రసానీతి । తస్మాద్రుద్రః పశూనామధిప
తిః। తస్యదేవమీఢుషో వయావిష్ణా శేతస్య ప్రగృహేహావిర్భిః । విధే
హిఠుద్రో రుద్రియమ్॥ సీ॥ సకలంబులను సృష్టి ♦ సలిపెడియాబ్రం
హ తపముదానొక్క వ ♦ త్సరముసలిపి। నపుడొక్కరుఁడు బుట్టి ‡
నంతన నేడ్వంగ నాతపంబునఁబుట్టి ♦ నాడపిన్న। మేల యేడ్చెదవన్న ♦
నీఁకపేరుఁబెట్టుమే ♦ నపహాశ పాపుడ నామనఁగ। రోదనంబుననం
త ♦ రొప్పితిగావున రుద్రుఁడంచనిపేరు ♦ మాఢినిడితి। నిటులఁగొన్నిం
టి నిమ్మన్న ♦ నెలమిశర్వ। భవమహాదేవ భీమోగ్ర ♦ పశుపతియన
నింక నీశానుఁడనఁగను ♦ నిటులపేరు। లిడిన నాబ్రంహగని శర్వుఁ ♦
డిట్టులనియె ॥4॥ కం॥ వరముల గొన్నిటినిడుమో । వరదా యోతం
డ్రియనన ♦ వారపుగరుణా। హరితోహవిష్ణు గుణుప్రము। ధరపశు
వుల కెల్లఁ బ్రభుత ♦ దనరుమయునియె ॥5॥ గీ॥ తనకు తొలిచూలు
శ్రేష్ఠుంకు ‡ తపసిపాప। తహేతుఁడు ధాత్రి సురుల ♦ ల్లరకుమే
టి। యయున హరునకు నిట్టుల ♦ నబ్జభవుఁడు। పేరులనొసంగి పిదపను
మెపునొసఁగె ॥6॥ కం॥ ఈతఁడు వేరగు యుగమున। ధాతకు తమ్మ్మ
నిగ హరికి ♦ తనయుండై యీ ♦ రీతిగ నెగడెను నను శ్రుతి । నీతరిఁ
జూపించువాడ ♦ నెంతయుగనుడీ ॥7॥ ( స్తో, భా, 78 హయశిర ఉ
పాఖ్యానమున. శ్రు॥ అథపునరేవ నారాయణస్సోన్యం కామం మన
సాధ్యాయత। తస్యధ్యానంతస్థస్య లలాటాత్స్వేదోజాయత । స్వేదా
ద్బుదమభవత్। బుద్బుదాత్త్ర్యక్షః శూలపాణి రజాయత॥ చం॥ హ
రుంతయుఁబుట్టగఁజేయఁజాలు దీ। వరునికు

మారుఁగాంచి బల ♦ వంతుని వేరొక నిన్సృజింప తా। నరుసముఁజెంద ఫాలమున ♦ నప్పుడె స్వేదముఁజారి బుగ్గగా। వరలిన శూలహస్తుఁడగు ♦ వాడు త్రిలోచనుఁడంచుఁ బుట్టెబో ॥8॥ శ్రీమహాభారతమున. స్మృ॥ బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టేలోకే చరాచరే। అభూత సంప్లవే ప్రాప్తే ప్రలీనః ప్రకృతౌ మహా৷। ఏకస్తిష్ఠతివిశ్వాత్మా సతునారాయణః ప్రభుః॥ గీ॥ బ్రహ్మరుద్రులు మొదలు స♦ర్వంబుసమయ। భూతసంఘములన్నియు ♦ బొలుపుమాన। నపుడె ప్రకృతి మహత్తత్వ ♦ మందెయణఁగ। నొకడె నారాయణుండె తా ♦ నొప్పియుండు॥9॥ చ॥ శ్రుతులిటుఁ బల్కుటల్విసిన ♦ జెచ్చెరదేలెడి యర్థమేమొ మీ। మతిఁదలపోయు డింకయిన ♦ మాన్యవతంసులార పుట్టువుల్ । స్థితిలయముల్గలట్టిరని ♦ తేటగఁదేలదె యిట్లుదేలగా । నితని పరాత్పరుండనుట ♦ యెట్టులొమీరలె జెప్పరాదొకో ॥10॥ ( స్తో, భా, మోక్షధర్మే ) స్మృ॥ ఏషలోక గురుర్బ్రహ్మా జగదాదికరః ప్రభుః। ఏషమాతాపితాచైవ యుష్మాకం చపితామహః। మయానుశిష్టో భవితాసర్వభూత వరప్రదః॥ సీ॥ ఈ చతుర్ముఖుఁడు మీ ♦ కెల్ల నాచార్యుండు సర్వజగత్సృష్టి ♦ సలుపువాఁడు। తల్లియుఁదండ్రి యీ ♦ తండె మీకెల్లర ♦ కును భక్తి నాయాజ్ఞ ♦ కొలది నంద। రకుతానె కొన్ని వ♦రంబుల నీఁగలాడితని తమ్ముఁడు రుద్రు ♦ డెట్టులనిన। నాఫాలమునబుట్టి ♦ నాకుగావున నితండా బ్రహ్మవరముల ♦ నందియుంట । తననుఁగొలిచినవారికి ♦ తప్పకుండ। తనకొలంది వరంబులఁ ♦ దద్దనొసగు। ననుచుసురలకు హరియెతా ♦ నన్నవాఁడు। గాదెయని మోక్షధర్మము ♦ నగ్రంథమందు ॥11॥ గీ॥ దీనిఁగాంచిన రుద్రుని ♦ తేజమెల్ల । నలుపమొసఁగిన యదియబో ♦ న్యాయముగను। తనకు తాఁబుట్టినది గాదు ♦ తెలిచిచూడ। ననుచు తేటగఁ దేలదే ♦ యాస్యలారా ॥12॥ గీ॥ అజునకిట్టులఁగలుగుమా♦హాత్మ్యమెల్ల। హరియొసంగినదని స్పష్ట♦మయ్యెమీద। గాని హరియంతకును తానె ♦ కారణంబు। గాగఁగాఁ లెడు ననమేమి ♦ గలుగుకీడు॥13॥ వ॥ ఇదియునుఁగాక. స్మృ॥ అచ్యుతానంతగోవింద నామోచ్చారణభేషజం। ఓం నమస్సంపుటీకృత్య జప

న్విమధకోహరః। గీ॥ అచ్యుతానంత గోవింద ♦ యనెడిమాత్ర। ముమ
నె యొంనపు యనుదాని ♦ జొనిపిభక్తి। జపము సేయుచునుండ వి♦
షమునుగ్రమింగ। విషపుబాధనుజెందక వెలసెహరుడు ॥14॥ గీ॥ విష్ణు
మంత్రంబుచే నాకు ♦ విషపుబాధ। తలగెననునట్టి మాహాత్మ్యముల
వి విష్ణు। మంత్రముంకేనో పార్వతీ ♦ మగనికేనో। తామె యోచింప
రాదెస ♦ న్మాన్యులారా ॥15॥ కం॥ ఇది గనుగొన హరునకు విష।
ముదనుణచెడిశక్తి విష్ణు ♦ మంత్రజపముచే। నొదవెనని చెప్పవలసె
ను। గద మీరలెసెప్పుడింక ♦ కరుణమెలర్ప ॥16॥ గీ॥ మిగుల తా
మసగుణముల ♦ మెలగుగాన। తామసంబున గుగ్రండు ♦ దప్పుసేయ
హరిదయాళుండు నన్నింట ♦ నణచిమేలు। సేయువాడను వచనము ♦
లెప్పవాడ ॥17॥ ॥ స్తో ॥ ॥ భా ॥ మాచ్యపురాణము। తతఃక్రోధ
సమాయుక్తస్సంరక్తనయనెనచ। వామాంగుష్ఠనఖాగ్రేణచ్ఛిన్నంత
స్య శిరోమయా। యస్మాదనపరాధస్య శిరచ్ఛిన్నంత్వయామమ। త
స్మాచ్ఛాప సమాయుక్తః కపాలీత్వం భవిష్యసి। బ్రంహహాకులితోభూ
త్వా చరంస్తీర్థాని భూతలే। తతోహంగతవాన్దేవిహిమవంతంశిలో
చ్చయం। తత్రనారాయణశ్శ్రీమాన్మయాభిక్షాం ప్రయాచితః। తత
స్తేనస్వకంపార్శ్వం నఖాగ్రేణ విదారితం। మహతీస్రవతీధారా త
స్యరక్తస్యనిస్సృతావిష్ణుప్రసాదాత్సుశ్రోణికపాలంతత్సహస్రధా।స్ఫు
టితంబహుధాయాతం స్వప్నలబ్ధం ధనంయథా॥ సీ॥ నలువ వ్రైదవ వ్రై
న ♦ తలమునానఖముచే కనులెఱ్ఱజేసినే ♦ మునుమునతండు। తప్పులే
కనెనాదు ♦ తలమందెగ్రించితిగాన పునుకదాల్పరివి గ ♦ మ్మనుచుశా
ప। మొసగిననపుడెంత ♦ యో బ్రంహహత్యకు వెరచినేతీర్థయా♦ త్ర
లకువెడలి। హిమవంతమున భక్త ♦ హితుండు శ్రీహరిం బ్రార్థనముసే
య తనపక్క ♦ నఖముచేతం। జీర రక్తంబు చిల్లున † జిట్టినపుడె।
కలనుగన్నట్టి రొక్కంపు ♦ కరణిం బోయె। శ్రీసతీశుని కరుణనుం ♦
జెప్పదరమె। యనుచుగౌరికి హరుండెతా ♦ ననెనుగాదే ॥ 18 ॥ స్తో॥
భా, మాత్స్యపురాణమున ) తతస్సశంకరోదేవ స్త్వంధకై రాకులీకృ
తః। జగామశరణందేవో వాసుదేవమజంవిభుం। తతస్స భగవాన్విష్ణు

స్పృష్టవాన్స్యమ్ర రేవతీం। సాపపోసకలం తేషామంధకానా మస్పృక్ష ణాత్ ॥ గీ॥ అంధకులు సేయునట్టి ని ♦ ర్బంధమునకు । నోర్వజాలక శంకరుఁడోడి వాసు। దేవుశరణని యనశుమ్ర ♦ రేవతినట। వరల జేసినవారి నె ♦ త్తురునుదాఁ)వే॥19॥ ఉ॥ ఈరీతిన్నన నీశ్వరుంను మరియెం తేతామసుండంచునుఁ। (శ్రీ)రామాధవుగూర్మి పాత్రమనుచుఁ ♦ నే రాము లౌ సేతలఁ। నేరం బెంచక సేయువాఁడు ననుచుఁ ♦ నిక్కం బుగా దేలదే। యోరాజన్మతులార జూఁ డుడిక యెం♦ తో సంతసంబొ ప్పగాఁ ॥ 20 ॥ స్తో, భా, ॥ విష్ణుధర్మే ॥ స్మృ ॥ పాఁ)ణినఃకర్మజనిత సంసారవశవర్తినః।యతస్తతోన తేధ్యానే ధ్యానినాముపకారకాః।నైస ర్గికో నైవబోధ స్తేషామప్యన్యతో యతః। యస్మాత్తదమలం బ్రంహ్మా ని సర్గాదేవబోధకృత్। ధ్యేయం ధ్యానవిదాంసమ్యక్తద్విష్ణోఃపరమంప దమ్ ॥ సీ ॥ ఏలోకమందేని ♦ నీ బ్రంహ మొదలుగా పాఁ)ణిసంతతు లుక ♦ ర్మలుగలార। లొదవిన సంసార ♦ మూఁడదన్నగలేక యజ్ఞాన మునఁజిక్కి † యలరువారు। వాఁరినిధ్యానించు ♦ వారికినుపకార లే శమైననుఁ జేయ ♦ లేరువారు। వారుహరిధ్యాన ♦ పారంబుఁ జెందియే వరములిచ్చెడి శక్తి ♦ వరలువారు। గాని తముదామె మహిమంబు ♦ గాంచలేరు। బ్రంహమగు విష్ణుమహిమచే ♦ బ్రబలువారు। హరియె ధ్యానార్హుఁడయ్యెడి ♦ నందరకును। నతనిలోకమె యందర ♦ కధిక మగును ॥21॥ మ॥ ఘనులాశాయిట బ్రంహయే మొదలుగా ♦ గాఁ)పా ణి సందోహ మం। చనఁ జేజేలును వారిలోపల హరుం ♦ డౌటన్నా రుండున్నరఁ। మనలన్బోలెను కర్మవశ్యులగుచు ♦ న్నాథర్తఁ సద్భక్తి కీ ♦ ర్తఁనమాహాత్మ్యముఁ గొంత జెందిరనుచు ♦ న్తథ్యంబుగా దేలదే ॥22॥ గీ॥ తొలుతమిక్కిలి యమం ♦ గళుఁడు హరుఁడు। క్రమముగా హరిపాదతీ ♦ ర్థమును సిరము.। నందుఁబూని చెలంగుట ♦ నయ్యె శి వుఁడు । ననుచుదెలిపెడి వచనంబు ♦ లను గనుండీ ॥23॥ భాగవతం బున. శ్లో॥ యత్పాదవిస్సృత పరిత్ప)వరోదకే నతీర్థేన మూర్ధ్న్యధిప గతేన శివశ్శివోభూత్॥ గీ॥ ఎవని శ్రీపాద తీర్థంబు♦ నెంచిసిరము। జే ర్చి చెలఁగుట హరుఁడప్డు ♦ శివుఁడనంగ। బరగెనాతని పాదప♦ద్మ

ములనెడద । నునుచి యెప్పుడు ధ్యానించు ♦ నధిక భక్తి ॥24॥ ఇదేవి షయము. భారతోద్యోగ పర్వమున. శ్లో॥ తతగ్రంగాం మహాదేవః పతంతీ గగనాచ్చ్యుతాం। ప్రగృహ్య ప్రదదౌలోకే మానుషే బ్రంహావిత్తమః॥ గీ॥ గగనమునుండి భువికిరా ♦ గడగినట్టి। గంగ వెసగాంచియపుడెశం♦ కరుఁడుబట్టి। దానితలబూని బ్రంహవి♦ త్తమతముట్టి। పేరుగనిమీద బుడమిపై ప్రీ ♦ తిఁబెట్టె ॥25॥ కం॥ భారతభాగవతంబులు। కూరిమి శ్రీహరినిఁ బొగడ ♦ గోరునటన్న। ధీరశిరోమణులా తా। ధారుణి నీశ్వరుని సంహి ♦ తను వెసఁగనుఁడీ ॥26॥ ( ర, సం,) స్మృ॥ ద్రవీభూతాస్తతోధర్మా హరిభక్త్యామహామునే। గృహీత్వా ధర్మపానీయం పదంనాథస్యతుష్టయే । క్షాళితం పరయాభక్త్యా పాద్యార్ఘ్యాదిభిరర్చితం। తదంబుపరయాభక్త్యా దధారశిరసాహరః। పావనార్థం జటాజూటే యోగ్యోస్మీత్య వధారణాత్। వర్షాణాయుతానథ బహూన్నముముంచ తధాహరః॥ చ॥ హరుఁడుతనంత పాపముల ♦ నన్నిటిఁ దోలెడి విష్ణుపాదమం। దలరిన గంగరాక హృద ♦ యంబునఁబొంగుచు నెంతయేకమం। దుజలమూని యఘ్ర్యము మొ ♦ దల్గలపూజలసల్పి భక్తిచే। నలరిపదాంబు వుల్సిరము ♦ నందునఁదాల్చె పవిత్రుఁడౌటకై ॥27॥ చ॥ ఇదే హరిపాదతీర్థముల ♦ నెంతయుభక్తి సిరంబునందునే। గుదిరిచితింక ధన్యుఁడను ♦ గోర్కెలుఁ దీరె ఫలించె పుణ్యమి। య్యది విడనాడఁగూడదు గ ♦ దాయని యట్టెశిరంబుపైన యా। మదనహరుండు బొంగిబహు ♦ మానముగా చిరకాలమూనెబో ॥28॥ ( రహ, పర, ) స్మృతి॥ కార్యత్వకర్మవశ్యత్వ శ్రవణాద్బ్రంహరుద్రయోః। మాయాపరవశత్వాచ్చభగవత్ప్రేష్యభావతః। శుభాశ్రియత్వరాహిత్యాత్తథాశాపాశ్రయత్వతః । విభూతిత్వాచ్ఛరీరిత్వాచ్ఛేషత్వాచ్ఛ్రిపతింప్రతి। ప్రకారత్వాజ్జాయమాన సంసారపద దృక్త్వతః అనుపాస్యతతోమోక్షే విలంబేప్య పటుత్వతః। భగవద్ద్వేషిసంత్రాణాచ్ఛక్త్యాతుదప్రిదానతః। తత్రాపి విష్ణ్వధీనత్వాచ్ఛేవ్యత్వాదపరిబుద్ధకైః। నానయోరైక్యసామ్యాది విష్ణునాసర్వజిష్ణునా । ఇతిజానన్నుపమాన్విష్ణౌ వేకాంతీ మోక్షభాగ్భవేత్॥ సీ॥ బ్రంహరుద్రులును

క ♦ ర్మకుఁ జిక్కియున్నట్లు శ్రీశు నానతిఁబను ♦ శ్వేయునట్లు। మా యఁజిక్కినయట్లు ♦ మాధవు కొలువులో మఱగినట్లశుభను ♦ ల్మఱ గినట్లు। తనశక్తియొకయింత దనరినయటు పరా ♦ త్పరుకూర్మి మహి మంబు ♦ దనరినట్లు। హరమార్తులకుక్షుద్రి ♦ వరములిచ్చినయట్లు న దిపూర్తిఁ తనశక్తి ♦ కబ్బినట్లు। సాత్వికులు తన్నుఁగొలువఁగా ♦ జన నియట్లు। క్షుద్రికోర్కెలుఁగలవారె ♦ గొలుచునట్లు। శ్రుతులయందు న స్మృతులందు ♦ జెలఁగెనిట్లు। గానపరతత్వ మితనికిఁ ♦ గలుగునెట్లు ॥29॥ కం॥ హరికిని బ్రంహకు హరునకు। నిరవుగ సామ్యంబు సెప్పు ♦ చే గూడదనఁ । పరతత్త్వైక్యంబులనెటు । వరలంజేసెదరొ సెపుడు వరగుణులారా ॥30॥ కం॥ హరిహరులకు సామ్యంబును। వరలంజేయు టయుగాదె ♦ వైష్ణవులారా। సరిసరియని యనఁబోకుఁడు । కరుణింపు డు వచనవితతి ♦ గాన్పింతునికఁ ॥31॥ ( స్తో, భా, బ్రంహాండకౌర్మ ముల ) యోన్యందేవంసమత్వేనవదంత్యజ్ఞానమోహితాః। నారాయ ణాజ్జగన్నాథా త్తైవై పాషండినస్స్మృతాః॥ భాగవతమున భగవంతునిఁ గూర్చి. శ్లో॥ అస్మాదన్యం పరత్వే నచేతయానోహ్య చేతనః । సపా షండీతివిజ్ఞేయ స్సర్వకర్మ బహిష్కృతః॥ గీ॥ హరినిబోలుదురుగద ♦ బ్రంహాదిసురలు। ననుచువిజ్ఞానమునఁబల్కు ♦ నంతవార । లవని పా షండులయ్యెద ♦ రనుచుబ్రంహ। కౌర్మములయందు వచనము ల్గారి లిగాదే ॥32॥ ( డి, ) స్మృ॥ యస్తునారాయణం దేవం సమత్వేనాభి మన్యతే। సతుతేనావమానేన నరకాన్నాతివర్తతే। యేతుసామాన్య భావేన మన్యంతే పురుషోత్తమం । త్తైవైపాషండినోజ్ఞేయా నరకార్హా నరాధమాః॥ కం॥ నారాయణులను వారికి । వేరొవేల్పులకు సవతు వెలయింతురొయ। వ్వారేగద పాషండులు। నారకులధమాధములు ను ♦ నరసంఘములోఁ ॥33॥ కం॥ అని యిటుఁ బల్కుట ముగ్గురు। నను వుగ సరివారలంట ♦ జనునేధాత్రిఁ । మనమునఁ బాగుగ మరి మో। చనఁజేయుచుఁ జెప్పరాదె ♦ సదయతనెంతో ॥34॥ గీ॥ హరు నికిడినట్టి నైవైద్య ♦ మవనినెవడు। కోరిమేనియు భ్రాంతినిఁ ♦ గూ డితేని। గుడువరాదని తేటఁజె ♦ ప్పెడిస్మృతులను। గాలఁ జేసితి

నాపైన గరుండు మీరు ॥35॥ చ ॥శివునకు బ్రీతి నిచ్చు నవి ♦ చెచ్చెరఁబూనుచు వానిసేవనే । యవసర మందు పీఁడతగ ♦ దంచనిభక్తిని౦గొల్చువారుగా । డవుజలపత్రభక్ష్యముల ♦ డస్నియునేనిభుజంపనంచనన్ ॥ దవిలియిత్తంతు మేటిపర ♦ తత్త్వమటంచనిబల్కు-టెట్లులో ॥ 36 ॥ హరుఁడె పరాత్పరుండయిన ♦ నాతనితీర్థము పత్రిభక్ష్యముల్పరిహారణంబు సేయుటది ♦ పాడియె యిట్లనుటన్ధరిత్రిలో। దురితయుతుండు రుద్రుఁడని ♦ దోపదెయా ననేమి సెప్పెదున్। దురితపువానిఁ గొల్చుటలు ♦ దోస మనన్పరతత్త్వమబ్బునే ॥ 37 ॥ సీ॥ ఈశ్వరాన్నము భుజి ♦ యింపఁగూడదటంచు దెలసిగదా విష్ణు ♦ దేవు నందుఁజేర్చి తీర్థాన్నము ♦ లీస్వీకరించుటలెల్ల నిటుసేయధరణి నెం ♦ తేనినింద్య। మగుశివాన్నంబున ♦ కహానిగలిగించు మాహాత్మ్య మెవనిదో ♦ మాన్యులార। గమనించుడీయింక ♦ కరుణించి నను చాల పక్షపాతంబుల ♦ న్వారదోలి। శివుఁడు వేల్పులలో నెల్ల ♦ శ్రేష్ఠుఁడగును। శాపయుతుడౌట నిట్టుల ♦ సలుపవలసె। నింతటనె వారి దోషంబు ♦ లెంచఁదగునె। యనిన వినయంబు మెరయఁగా ♦ మనవిసేతు ॥ 38 ॥ సీ॥ శాపమిచ్చెడివాడు ♦ శాపమందినవాడు వీరిలో గొప్ప యె ♦ వ్వారుసెపుడు। వరములిచ్చెడివాడు వరము ♦ లందినవాడు వీరిలో గొప్పయె ♦ వ్వారుసెపుడు। మంత్రికర్తయొకండు ♦ మంత్రిజప్త యొకండు వీరిలో గొప్ప యె ♦ వ్వారుసెపుడు। శాపయుక్తుని ఘనుడంట ♦ జనునెసెపుడు। హరుని శప్తుడటంచు మీ ♦ రనరెసెపుడు । వరములందడె హరివేడి ♦ కరుణసెపుడు। రామమంత్రంబు మానునే ♦ రక్తిసెపుడు ॥39॥ గీ॥ పునుక హారికూర్మిఁ జాయడే ♦ పూనిసెపుడు। యిట్టివానికి పరతత్త్వ ♦ మెట్లుసెపుడు। యితఁడుగాదంచు శ్రుతిజెప్ప ♦ దేమిసెపుడు ॥40॥ గీ॥ శివుఁడు పరతత్త్వమనిజెప్ప ♦ జెల్లు శ్రుతికి। నిక్కమయినట్టి యర్థంబు ♦ నెగడఁజేతు । దేనికిని బాధలేనట్లు ♦ తేటగాను। నన్నుదయజూడుడింక స ♦ న్మాన్యులారా ॥41॥ చ॥ భళిభళి యేమిసెప్పెదరు ♦ పండితవర్యుల బోలెవారలి ♦ ట్టులవచియింతురొక్కొ-యొక ♦ దుర్ శ్రుతులన్గనలేదె మేమున్। గలుగవె యీశ్వరున్న

రము ♦ గా నచి యించెడు నట్టివాని మీా । రలు మరి దాచి నంత టనె ♦ గ్రంథము లెట్టుల దాచఁజెప్పుడీ ॥42॥ అనిన. చం॥ శ్రుతులవి లేవు లేవనుచు ♦ జెప్పము వానిని దాచుటొప్పు న । స్మృతియును లేను మా కెపుడు ♦ మాన్యవతంసులు మీార లూరకే। యతినిబిడంబుగాఁ బలుక ♦ నౌనె యొకింతియు నన్ను సద్దయాం । చితులయి జూడుడింక నవి ♦ సెప్పెద తేటగ నొప్పునట్లుగాఁ ॥43॥ చం॥ శ్రుతులనుఁగల్లలం టలుని ♦ సీయదిమిక్కిలి రోతవానిలో। నతికినయర్థమున్గొన మిఁయం తకురోతలు వానిలోవిరు। ద్ధతఁ దొలగింపకుండనిదె ♦ తథ్యమటంచ ని యెంతయో మరు। ద్ధతులనుఁబూని పల్కుటలు ♦ తప్పకయంతకు రోతఁజూడుడీ ॥44॥ ఉ॥ కావున వానివానికిని ♦ గల్గువిరుద్ధత లెల్ల వే గమే। దోవ్రుడుసేసి యన్నియొక ♦ త్రోవకుఁ దెచ్చి చెలంగియున్న యా। ధీవరులైన మాగురువు ♦ దిట్టలుపల్కెడి పల్కుపంతుగా। నేవ చియింతు వారికృప ♦ నేగద యన్నిటినిండఁ జేసెడిఁ ॥ 45 ॥ శ్రు॥ సబ్రంహా సశివస్సేన్ద్రస్సోక్షరః పరమస్స్వరాట్। సఏవవిశ్వస్స ప్రాణ స్సకా లోగ్నిస్సచ చ్ఛ్రమాః। సఏవ సర్వం యద్భూతంయచ్చభవ్యంసనాతనం జ్ఞాత్వాత మృత్యు మత్యేతినాన్యః పంథావిముక్తయే।ఉ॥ వాఁడెశివుం డు నక్షరుఁడు ♦ బ్రంహ్మయునిందు్రఁడునగ్గిలోకముల్। వాఁడె గవిశ్వ మున్మరియు ♦ వాయువులున్భువనంబు సర్వముఁ। వాఁడె చరాచరం బులును ♦ వానిసనాతనుఁ గొల్చుచున్న యెవ్వా। డునుగానిమృత్యువు ను ♦ బారఁగదోలెడి దిట్టమైతగుఁ ॥ 46 ॥ వ ॥ తొలుతటి వాఁడు విష్ణువగు ♦ తోయజజాతుఁడు వానిపుత్రుఁడై। వెలసెడి వాని పుత్రుఁ డయి ♦ వెల్గెడునీశ్వరుడిట్టులుండలో। కులుతమవారి పేర్లకను ♦ కూ లపు పేర్లనుఁ బెట్టురీతియా। నలువయుఁగూర్మి బాలునికి ♦ నాటినభ క్తినిశౌరిపేర్లిడెఁ ॥ 47 ॥ వ ॥ ఇదియునుంగాక ॥ (చ)తిరమగుభక్తి పుత్రులకు♦ దేవునిపేర్లను బెట్టశాస్త్రమా। తరగతిబ్రంహ్మయుందన కు ♦ దైవతమైవిలసిల్లునట్టిశ్రీ। హరికనుకూల నామములె ♦ యంద గఁ ♦ జేసెనుగాదె మూడుక। న్నులుగలవేల్పు దిట్టయుత ♦ నూజుడ టంచనికూర్మి పెంపునఁ ॥ 48 ॥ (కం) హరిభక్తులుతమపుత్రులకిర

వుగ హరిపేర్లుభక్తి ♦ నిడనీతండే। పరతత్వమనుచు జెప్పం। దరమే యోచించి తమరె ♦ తథ్యముసెప్పుడీ ॥49॥ ఇంకయును నొకటి. గీ॥ అ న్నిశబ్దములకు పర ♦ పరమాత్మ యర్థ। మయ్యె డాతడెయవని నా♦ రాయణుండ। టంచుఁదెలుపవె శ్రుతులు తా ♦ మంతచెలఁగి। గానినీ జాడ నేనియుగాని యిపుడు ॥50॥ గీ॥ హరునిబోధించు శబ్దంబు ♦ ల న్నిహరికి। నర్థవ్యానానుటకు సంది ♦ యంబుఁగలదె। గాన పైశ్రుతి యందున ♦ గాఁలు శివప ♦ ద బునకు విష్ణువర్థ మై ♦ దగులుసుండీ ॥51॥ కావున. గీ॥ శివుని పరతత్వమను శ్రుతిజెప్పుస్వచ్ఛ। మైనయ ర్థంబు హరిపర ♦ మానుగాని। హరపరంబంట గాదుబో♦ యనుచు తానె। యింకయొకరీతిదెలిపెద♦ పొంకముగను ॥52॥ ఉ॥ దేహములం దు జీవులెటు ♦ దీటుగనుందురో యట్టిరీతిగా। శ్రీహరి శంభుదేహమున జేరియెయుండెడి గానవేరుగా। నూహలికేల శంభుఁడన † నొప్పును శంభునియందు వెల్గునా। శ్రీహరికర్థమా యిటుల ♦ జెప్పిన దోసముల న్నిఁ ద్రిరడిఁ ॥53॥ గీ॥ శంభుఁడన శంభుదేహవా♦ సంబుగనిన। శ్రీహ రికి నట్టులర్థమై ♦ చెలఁగుచుండు। గంగయందుననున్నది ♦ గాఁమమ న్నిన। గంగతటయు డగ్గరి ♦ గాఁలునటులే ॥ 54 ॥ ఇదియునుఁగాక. చం॥ తెలతెలవారు వేళలనిదే ♦ యటుఁ జూడుడి యెండ గాసె నం। చిలసుతుగన్నతండ్రి గురు ♦ విట్టులెశిష్యుల జీతగాండ్ర లై। తులునిటు న్నిద్రఁదేల్పుటలు ♦ దూకొనియుండుట లోకధర్మమై। యలరునుగాని నిక్కముగ ♦ నప్పుడొకింతయు నెండయుండునే ॥55॥ గీ॥ ఎండగాసెన. టన్న నా ♦ యెరడకొంత। కాలమునకెంక వచ్చున ♦ న్కరణిగంగ। నున్నపురమన గడ్డపై ♦ నున్నకరణి। శివుఁడనంగను శివునిలో ♦ శ్రీశుఁడగును ॥56॥ గీ। తేటగానున్న యర్థంబు ♦ దీసివేసి। యటుల క ల్పనమునుసేయు ♦ టేలయనిన। కాదు పరతత్వ మితఁడని ♦ గలుగు శ్రుతుల। నిలుపుటకుగానె యటుసెప్ప ♦ వలసెజుండీ ॥57॥ సీ॥ నొ ప్పువండితుల ప ♦ ల్కులలోన నొకదానికొక దానికర్థంబు ♦ లొప్ప కున్న। బుద్ధిమంతులుదాని ♦ బోనీకయంతకు న్తాత్పర్యభేదము ‡ ల్దగి లిసెప్పి। సరఁగనవ్వాని సం ♦ స్థాపనంబునుఁజేసి యొార్య పల్కులకు

వి ♦ ఖ్యాతినెఱపి తనురిచాతుర్యము ♦ తయుఁజూపి యాదరకును
సంతసంబునుఁ ♦ గూడజేసి మెలగుటంబగాదె బుద్ధిమం ♦ తులవిధ
బు । నటులసేయక యున్నదు ‡ న్నటుల జెప్పి । పండితుల నెల నపకీ
ర్తిపాలుసేసి చెలఁగువారల నంద ♦ జెట్టులన రే ॥58॥ సీ॥ సర్వ
కాలంబు నీ ♦ శ్వరుఁడు శ్రీరామునుంతముఁ బఠించును ♦ ...విలిచె
లుపు । నైన జెప్పినయుని ♦ పరతత్వ మది శివు ♦ నకు లేదటంచు ... తేయు
ను దెలుపు । నదిగాక హరువిమా ♦ హాత్మ్యమంతయు వాసుదేవునికి
పనని ♦ తేటదెలుపు । నిరిమెల్లజూడగా నీ ♦ శ్వరుండెప్పుడు న్హరిభ
క్తుఁడేయాచు ♦ నదియుఁదెలుపు । గాని హరిమెపరంబని ♦ గద్దిగాను
మనమునఁగుదిరింపలేదన్న ♦ మాన్యులార । యేమొయా హైనవన్నియు ♦
నెసఁగియున్న । వైనఁదమయాజ్ఞ కొలది వారి ♦ ఒందలఁతు ॥59॥
( భార, ఆశ్వమేధికే, వైష్ణవధర్మానసే, ) అనాశ్రితోప్యచ్ఛ్రియం
నాస్తి ముఖ్యమాశ్రయమాశ్రయేత్ । రుద్రం సమాశ్రితా దేవా రు
ద్రో బ్రహ్మాణమాశ్రితః । బ్రహ్మామామాశ్రితో రాజన్నాహంకి
చిదుపాశ్రితః । మమాశ్రయో నకశ్చిత్తు సర్వేషామాశ్రయో హ్యహం ।
ఇదం రహస్యం కౌంతేయ ప్రోక్తవానహమవ్యయం ॥ ఉ। ఆదరికన్న
నెక్కుడగు ♦ నాతనిగొల్చుట పాడియంచు మీ ♦ రందరుజెప్పరేమి
యిటు ♦ లంటు రుద్రుని గొల్తు వేల్పులా । యిందుధరుండు బ్రహ్మ
నెద ♦ నెప్పుదలంచు బ్రహ్మ నన్నె బో । జెందిభజించు నే నొకని ♦ చి
త్తమునందుదలంప నెప్పుడేని ॥60॥ గీ॥ అవనినంతయు పేరన్న ♦ యా
శ్రయించు । నిది యెక్కలి గోప్యమై ♦ యెసగుననుచు । ధర్మరాజును
శ్రీహరి ♦ తద్దకూర్మి । బలికెగద యశ్వమేధంపు ♦ పర్వమునను ॥61॥
గీ॥ తనదు బలిమిని తా జెప్పి ♦ కొనుట లోక । ధర్మమగుగాన నీపల్కు ♦
తనివిసను నె । యన్న నీహరివంశంబు ♦ నంగదేవ । తలకు శివుఁడసి
యున్న ప ♦ ల్కులను వినుఁడీ ॥62॥ హరివంశమున. ఏతదేవపరంవ
స్తు నైతస్మాత్పరమస్తి వః । ఏవమేవ విజానీధ్వ మేతద్వః పరమంతపః ।
ఓమిత్యేవం సదా విప్రాః పఠధ్వం ధ్యాత కేశవం ॥ ఉ॥ దేవతులార శ్రీ
హరికి ♦ దీటగు వేలుపు లేనె లేదు బో । దేవుడెగా పరాత్పరుఁడు ♦ దిట్ట

యునంతకుజాలువాఁడు నీ। దేవునిఁ గొల్చుచేమనకు ♦ దివ్యతపంబుజ పంబుగాన ని। దేవుని సంస్మరింపుడు ను ♦ దీర్ఘ కలకాలము ముక్తి యబ్బెడిన్ ॥63॥ గీ॥ అనుచు నను గొల్చువేల్పుల ♦ కందరకును। ధన్యతనుఁజూప హరుఁడె స ♦ త్కరుణతోడ। బలికియుండఁగ నీతండ♦ పరమనంగ। సందియంబని పల్కుట ♦ లాస్యధ్యపడునె ॥64॥ చ॥ తన సతి ధన్యమా తెరవు ♦ తప్పక సెప్పుమటన్న నీశ్వరుం। డనుగద రామ మంత్రమున ♦ కన్నను వేరొక మంత్రమున్నదే। యనయముదానినే ప ఠన ♦ మందుటగాదొకొ యిట్టి తేజమిం। దునె నొడఁగూడె నాకనుచు♦ తోయజలోచన మైనగౌరితోన్ ॥65॥ కం॥ అనియంతన నిలువక గౌ రిని వెసడగ్గరకుఁజేర్చి ♦ ప్రీతినిమంత్రం। బును తత్పరిభావములతో। నొనకొని యుపదేశమిచ్చె ♦ గొబ్బుననతఁడే ॥66॥ గీ॥ తానె నిజము గ పరమమై ♦ దనరెసేని। తథ్యమును వేదుచున్నట్టి ♦ తన్వికిటులు। తన్నుఁజెప్పక రామమం ♦ త్రమును జెపునె। మీరెజెప్పుడు యోచించి♦ ధీరులారా ॥67॥ గీ॥ తన్ను తాఁజెప్పి కొనుటలు ♦ తరముగాద। టంచు రుద్రుఁడు ప్రీతివ ♦ చించెబోలు। దీనినమ్మ మటంచన దెలుపుడింక। వచనతతులను గనుఁడు వి ♦ ద్వాంసులారా ॥68॥ ( స్తో, భా, పరాశరసంహిత ) రుద్రాదిత్యావ సవోయేచ సాధ్యావిశ్వేశ్వినామరుత శ్చోష్మపాశ్చ। సర్వేభవంతం శరణంగతాస్స్మః। కురుష్వపూజ్యా నిహాయజ్ఞమూర్తే॥ గీ॥ నలువముక్కంటి మొదలుగా ♦ గలుగువేల్పు లెల్లరును నినుశరణని ♦ యుల్లసిల్లి। నారమిక పూజ్యులనుజేసి ♦ చేర దీసి। వెలయజేయుము వేవేగ ♦ విశ్వమూర్తీ ॥69॥ ఇందున నే మరియొక్కటి. స్మృ॥ నారాయణాత్పరోదేవో నభూతో నభవిష్యతి। ఏత ద్రహస్యం వేదానాంపురాణానాంచసత్తమ॥ గీ॥ సకల వేదాది సద్రహ ♦ స్యములు నివియె। గాదె నారాయణుని కన్న ♦ గలుగఁబోడు। యిప్పుడును లేడు బోయింక ♦ యితఁడపరము। గాదనన్యెడుగాదె స ♦ ద్గ్రంధవితతి ॥70॥ ( స్తో, భా, శారీరక సూత్రకారుఁడు ) స్మృ॥ కాల స్యచహిమృత్యోశ్చ జంగమస్థావరస్యచ। ఈశతే భగవానేక స్సత్యమేతద్బ్రవీమితే। కృష్ణఏవ హిలోకానా ముత్పత్తిర పిచావ్యయః।

కృష్ణస్యహికృతేభూతమిదంవిశ్వంచరాచరం। జ్యోతీంషిశుక్లానిచయాని
లోకేత్రయోలోకాలోకపాలాస్త్రయీచ। త్రియోగ్నయశ్చాహుత
యశ్చసర్వే సర్వేదేవాదేవకీపుత్రఏవ। తత్వంజిజ్ఞాసమానానాం హే
తుభిస్సర్వతోముఖైః। తత్వమేకోమహాయోగీహరిర్నారాయణఃప్రభుః
సత్యంసత్యం మహాసత్యముద్ధృత్యభుజముచ్యతే॥ వేదాచ్ఛాస్త్రంపరం
నాస్తి నదైవంకేశవాత్పరం। ఆలోడ్యసర్వశాస్త్రాణి విచార్యచ పునః
పునః। ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణోహరిః॥ గీ॥ వేద
శాస్త్రపురాణాది ♦ వితతులెల్ల। గలపరింపంగ హరికన్న ♦ ఘనుఁడు
లేడు। వేదమునకన్న శాస్త్రము ♦ ల్వేరెలేవు। తత్వమన హరికన్న త
త్వ ♦ మ్మొలేదు ॥71॥ సీ॥ ఇలకును కాలమృత్యులకును జంగమస్థావ
రంబులకెల్ల ♦ చక్రవర్తి। యాకృష్ణుఁడొక్కఁడే ♦ యిదినిక్కమిత
డు జీ♦ వులకెల్లపుట్ట చా ♦ వులకుకర్త। నీతని కొఱకుగా ♦ నీవిశ్వ
మును చరా♦ చరములువేదశా ♦ స్త్రములులోక। పాలురాహుతులు
ప్ర ♦ పంచంబు నెల్లదే♦ వతలిటులూహల ♦ మతినిఁ జేయ। తత్వవి
జ్ఞానమునుఁగోరు ♦ ధన్యతతికి। తత్వమీతఁడె యీతఁడీ ♦ తండెనిక్క
మనుచు ముమ్మాటికిన సంది ♦ యంబులేద। టంచు వ్యాసులెచా
టిప ♦ చించినారు ॥72॥ అనిన. శా॥ శ్రీనారాయణువీడి యన్యులస
మ ♦ ర్థింపంగరానట్టి శ। బ్దానీకంబులతోడ నిష్ఠపరత ♦ త్వ స్థాపనం
బున్వ్యాసర్షి। గానంజేసిన యేమిసందియముఁగ ♦ ల్గఁబోదుగానట్టి పం।
థానంబున్విడనాడి చిక్కులను నం † దంజేయగా నేలకో ॥73॥ చ॥
అనెదరెయిట్లు మీరనిన ♦ నయ్యరో మారు వచింపసాధ్యమే। యన
యము నొక్కశబ్దమునె ♦ యానని వాడుచు నుండెనేనిఁ దా। నినిఁగని
శబ్దములక్కరువె ♦ నేర డితండనిబల్కఁదానికే। మని వచియింపగావలె
నా ♦ యారయనిట్టుల బల్కవచ్చునే ॥74॥ గీ॥ అయిన మాపాలివా
డు శ్రీ ♦ హరియుగురువు। వారిపదముల మదినిడి ♦ కోరిభక్తి। జెప్ప
గనుప్రీతితో నిష్ఠ ♦ జెలఁగువాడ। నేమి యేనియుగాని బో ♦ యింక
మీఁద ॥75॥ ఉ॥ లోకములోన దుష్కృతము ♦ లొఁబడి బొర్లెడి వా
రలెల్ల జీ। కాకునుఁజెందిజెంది మది ♦ కశ్మలమందు మునుంగునంచు

తా। మాకటివేల్పునానతిన♦ పార్థచయంబున కింతసందుగా।పీకగవెల్లు
పుట్టువుల ♦ పీడినపల్కుల గొన్ని చోటులన్ ॥76॥ గీ॥ వాని నొకింత
యూదితమ ♦ వాగ్విభవంబుల నెల్లఁజూపి పా । పానలదగ్గ దుష్కృ
తుల ♦ నందఱునానరకంబు పాలుగా। నీకలి కోసమై నెగడె ♦ యెం
దరో పెద్దలు వ్రాయుగ్రంథముల్। దీనికిచింతసేదగదు తేలినయర్థము
పెద్దవారికో ॥77॥ ఉ॥ ఇందఱ నొక్కతూరి నిటు ♦ లెంతయుఁగూరి
మిదక్క మోసముం। జెందగజేయ పుణ్యములు ♦ సెందునె యన్నను
దుష్టదండనం। బెందుచనేని పాపముల ♦ నిచ్చునె పుణ్యముఁదోలఁజా
లునే। సందియ మేలకో యిదియు ♦ సారసనాభునియాజ్ఞ గాదొకో ॥
78॥ ఉ॥ సారసనాభుఁడైననిటు ♦ చయ్యన మోసము సేయవచ్చునే।
వారిని పక్షపాతులను ♦ వారలులేమిని జేసియుందు రే। వారికి దుష్టశి
క్షయెయ ♦ వారితమైన వ్రతంబెయుండగా। ధారున దుష్టకర్ములను ♦
దండనసేయుటతప్పె సెప్పుడీ ॥79॥ సీ॥ తనతోడివారు వీ♦ రనియును
తనకన్నఘనుఁడు వీడనిజెప్ప ♦ గానువీరు। తనువీడియింక యు♦ న్యుని
గొల్చు వాలెం దరోధృఢభక్తితో ♦ నన్నెగొలుచు । వార లెందరో
జూతు ♦ వీరిభక్తి శ్రద్ధలనుచుపరీక్షసే ♦ యఁగదలచి। యొకశబ్దమున
కు వే ♦ రొకయర్థమగురీతి బఱగుశబ్దములతోఁ ♦ బరమతత్వ। మును
దృఢంబుగ స్థాపించి ♦ మనమునందు। నందరిట్టులె మోసంబు ♦ నంద
గలర। టంచు నితరులు పరముగా ♦ దంచుదెలిపి। మోసబోకుడు నే
జేయు ♦ మోసమునకు ॥80॥ గీ॥ అచుచువచియించి తానుఁజే ♦ సిన
యదియును। మోసమన్నను జెప్పకు వి ♦ ద్వాంసులార । నిదిగొమీ
సొత్తు దొంగిలిం ♦ చెదనటంచు। జెప్పిసేసినచతురు శిక్షింపఁగలరే ।
81॥ చం॥ ఇదియునుగాక ధాత్రినెవ ♦ రేనియుదొల్త నొకింతఁ జెప్పి
యా। పిదప మరొక్క తీరుగను ♦ పెంపగు నర్థచయంబుఁదోలియా।
పిదపనె తేటతెల్లముగ ♦ ప్రీతిగఁజెప్పిన నట్టిదేగదా। పదిలముగాఁదన
ర్చునది ♦ పండితులెల్లరు దాల్తురొదలన్ ॥82॥ గీ॥ కాన యిట్టివి యె
న్నితమే ♦ న్గారణములు। గలిగియుండుట గాదె యి ♦ క్కరణి శ్రుతు
లు। వేరెయొకకొన్ని యర్థము ♦ ల్వెలయునటుల। వెలసెనికనైన మీ

భ్రాంతి ♦ వీడగలండే ॥83॥ కం॥ అన్నియుసరి వేయిటు మీ। రెన్నె న్నియొ బూటకముల ♦ నిదెతగవనంగా। బన్నిరిరిగాని యొకటే। నన్నదె యాధారమనిన ♦ నొప్పింతునుడీ ॥84॥ (ప్ర, ధ, స, చ్ఛ, నారదీయసంహిత) రాక్షసాః కలిమాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు। విష్ణువైష్ణవ విద్వేషాః ప్రచరిష్యంతితామసాః॥ అంతశ్శైవం బహిశ్శాక్తం సభామధ్యేతు వైష్ణవం। కలౌకేచిత్ప్రవర్తంతే వర్ణాశ్రమజనాముసే॥ సీ॥ కలికాలమున రక్క♦ సులు విప్రయోనులం దెల్లెడబుట్టితా ( ముల్లసిల్లి। విష్ణువైష్ణవజన ♦ ద్వేషులై తామస గుణముల నెంతయుం ♦ గూడిచెలంగి। భరియింపుచుండి లో ♦ పల శివుంగొల్చుచుఁ శక్తిపరత్వంబు ♦ సరసిమెరసి। సభవిష్ణుతత్వ సం ♦ స్థాపనంబునుఁజేయు గ్రంథవితతులకు ♦ గంతులిడుచు। నెక్కడికి గాకయునుతామె ♦ యొక్కడనుచు। నవనివర్ణాశ్రమపు ధర్మ♦ మనుసరించి। గొందరుందురు కలినంచుఁ ♦ గొనసరిగొసరి। యిప్పుడీ నారదీయ సం ♦ హితవచించు ॥85॥ ఇదియునుంగాక. లిఖితస్మృతి॥ ప్రాప్తే కలియుగే ఘోరే ప్రచరిష్యంతి తామసాః॥ (చాసురాః) వేదార్థం చాన్యథా సర్వే ప్రవక్ష్యంతి కలౌయుగే॥ గీ॥ ఘోరమగు కలికాలంబు ♦ గూడునపుడు। రక్కసులు పారులనఁబుట్టి♦ యుక్కుమెరసి। వేదములగొన్ని యర్థముల్ ♦ వేరుఁజేసి। జెలంగుచుండ్రని లిఖితుండు ♦ జెప్పినాడు ॥ 86 ॥ విష్ణుపురాణము. సర్వేబ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తేతు కలౌయుగే। నానుతిష్ఠంతిమైత్రేయ శిశ్నోదర పరాయణాః॥ గీ॥ అంతయును బ్రహ్మయనుచు ♦ నీయఖిలజగము। కలియుగంబున నొకరినొక్కరినిగనక। పొట్టకును కంతుకేళికి ( మిట్టిపడుదు। రంచు విష్ణు పురాణంబు నందు వ్రాసె ॥87॥ గీ॥ ఎందరుఁ జెప్పితేమి యిటు ♦ లీశ్వరుఁడిట్లు వచింపలేదెయం। చందురొయేమొ పాద్మమున ♦ నింతకునెక్కడు గానెగారితో। సందియమెల్లఁ బాయునటు ♦ చక్కగజెప్పెను దానినైన మీ। రందరుఁజూచి సందెముల ♦ నన్నిటిఁదోలెద రేమిసెప్పుడీ ॥ 88 ॥ పాద్మే) వేదార్థ వన్మహాశాస్త్రం మాయావాద మవైదికం। మయైవక థ్యతేదేవి జగతాం నాశకారణాత్। ద్విజన్మనొజైమినినా పూర్వం వే

దమ పార్థ కం। నిరీశ్వ రేణ వాదేన కృతంశాస్త్రం మహత్తరం। శా స్త్రాణీ మానిగిరిజే తామసానిని బోధమే॥ సీ॥ పాపకర్మలఁ నె ల్ల ♦ పంకుటాకులఁబోలె నరకంబు లోపల ♦ నాడురాల్ప। వేదార్థ ములఁబోలె ♦ విలసిల్లునట్లుగా నంతయుమాయ యం ♦ చనుచువేద। సంబంధమే లేక ♦ సలిపితిగొప్పశా♦స్త్రము పాశుపతమున శైవమనగ। వేదార్థములకెల్ల ♦ విపరీతమా యర్థముల సల్పెగాదె జై ♦ మినిమ హర్షి। దేవుఁడేలేడు లేడుబో ♦ దేవుఁడనుచు। గొప్పగాజెప్పె నందరి♦ కొంపలార్ప। తామసంబు లోకింతయుఁ ♦ దరముగాదు। మంచివారి కొకింతయు ♦ మదినిఁ జొరవు ॥89॥ (ప్రప, భా, రము, ) పాద్మేమా యా వాదమసచ్ఛాస్త్రం ప్రసన్నం బౌద్ధముచ్యతే। పరమాత్మ జీవ యోరైక్యం మయాత్రప్రతిపాద్యతే। వేదార్థ వన్మహాశాస్త్రం మా యావాద మవైదికం। మయైవకథితందేవి అసతాం నాశకారణాత్। బ్రహ్మణశ్చ పరం రూపం నైర్గుణ్యం వక్ష్యతేమయా। సర్వేజగ దుపద్రవత్వం మోహనార్థం కలౌయుగే॥ సీ॥ పరమాత్మయొక్కఁడే పరమాత్మయేజీవుఁ డితనికన్నను వేరొ ♦ కింతలేదు। సర్వంబుమాయ యం ♦ చనెడున సద్గ్రంథమది బౌద్ధమతేనా ♦ నలరుచుండు। వేదార్థ ములఁబోలె ♦ విలసిల్లునర్థముల్ బ్రహ్మనిర్గుణుఁడంచు బరిఢవిల్లు। దు ష్టకర్ముల నెల్ల ♦ దోసంబులోఁద్రోసి ముక్తిఁ జేరనియట్లు ♦ మొనసి నే ను। జేసియున్నాడ హరియాజ్ఞ ♦ చేతమున్ను। దానిగాంచిన పాపము ల్దప్పవంచు ॥90॥ ( పరమవైదిక సిద్ధాంతరహస్యము ) బ్రహ్మాండ పు రాణోద్ధాహృతము॥ త్వంచరుద్రమహాభాగ మోహశాస్త్రాణికారయ అసత్యానిచశాస్త్రాణి దర్శయస్వమహాభుజ। ప్రకాశంకురుచాత్మానమ ప్రకాశంచ మాంకురు। అహం మర్త్యావతారేషు త్వాంసదా పూజ యామ్యహం॥ మ॥ జనులన్మోసముఁ జేయు శాస్త్రములనో ♦ శర్వుం డవేజేసి యం। దునని న్నే బలు గొప్ప జేసినను నెం ♦ తోగప్పి సర్వం బునుం। గననా నన్నియుగల్ల లే యనుచునుం ♦ గల్పించు నేనున్మదం। బుననే మర్త్యులయందు బుట్టినయెడ ♦ బూజింతు సద్భక్తినీ ॥91॥ కం॥ అని ఘంటా ఘోషముగా। వినిపించెడి వచనతతుల ♦ వీడుచు

శివుఁడే। ఘనుఁడనిజెప్పగ దరమా। యనయము శ్రీహరియెతత్త్వ♦మూ
తఁడెఘనుఁడౌ ॥92॥ఉ॥ కావున భక్తిశుద్ధతనుఁ గన్గొనఁజేయఁగనిప్పు
డిట్టులెం। తోవిలసిల్లు శాస్త్రముల ♦ దూరినయంతన ముక్తిచ్చులున్న
యా।తోవనుదూరువాని క్రియఁ♦దోపుకుజేసుకపుణ్యరాశిమో।క్షా
వహమైన త్రోవకిక ♦ నంతకునంతకు దూరమయ్యెడిన్ ॥93॥ సారాం
శము ) సీ॥ హరునకుబుట్టు చా ♦ వులుఁగల్గియున్నట్లు హరిమంత్రపఠ
నంబు ♦ నందినట్లు। మనబోలెసంసార♦ మునమున్గియున్నట్లు హరిభక్తి
మహిమంబు♦ నందినట్లు। బ్రహ్మ హత్యకుఁజిక్కి♦ బాధ లందినయట్లు
హరికూర్మిదాని బో ♦ నాడినట్లు। తనసతి రామ మంత్రమున ♦ దన్వి
నయట్లు హరుఁడుపరంబు గా ♦ దన్నయట్లు । మోక్షమిచ్చెడి యాశ
క్తి ♦ మెునయనట్లు। శివుఁడ పరతత్త్వముగునని♦ జెప్పినట్లు। వెలయు
శ్రుతులకువేరర్థ♦ మలరునట్లు। నశుభములయందెకూరిమి† నందినట్లు॥
సీ॥ బ్రహ్మాదిదేవతా ♦ ప్రవరులతమశక్తి నీడ్చిదాస్యంబుఁ జే♦ యించి
నట్లు। తనయందె వారంద ♦ రునుఁ బొడిమినయట్లు తనయందె లీన
మౌ ♦ ననినయట్లు। కల్పాంతములయందు ♦ గదలకయున్నట్లు బొట్టి
బ్రహ్మాండము ♦ బెట్టినట్లు। గొప్పవస్తువులలో ♦ గొప్పయయ్యునున
తి సూక్ష్మవస్తువులలో ♦ జొచ్చినట్లు। నంతకాధార మీతండ ♦ యని
నయట్లు। హరికిసరియగు వాడెలే ♦ దనినయట్లు। గ్రంథవితతులనీరీతి♦
వ్రాసినట్లు ॥95॥ సీ॥ ఒకఁడె నారాయణుం ♦ డొప్పు నంచని యంత
చాలక బ్రహ్మయీ ♦ శానులందు। నెవరుగారనుచు రెం ♦ డవసారి
వచియించి కారుకారని గట్టి ♦ గానుఁబలికె। కారనుటకుగాను ♦ కా
రణంబుల నెన్నియేనియో వరుసగా ♦ నెంచిజెప్పి। నారాయణుండె
యా ♦ ధార మంతకు పరాత్పరుఁ డంచు మున్మారు ♦ బ్రతినసలిపి
శ్రుతులు సంహితలునునట్లె♦స్మృతులుమరియు। సాత్త్విక తమంబులౌ
గ్రంథ ♦ సమితియొకట। జెలగియెంతయు దృఢముగా ♦ జెప్పుచుండ।
దగును నారాయణుఁడె పర ♦ తత్త్వమనఁగ ॥96॥ గీ॥ ఎటులఁజూచిన
పరతత్త్వ ♦ మీశ్వరునకు। నబ్జజాలదు నిజము నా ♦ రాయణుండె।
యంతకర్తయందు పరమాత్మ♦ యతఁడెజుమ్ము। గొలువవలెనన్ననతనిసే♦

గొలువవలయు ॥97॥ శా॥ శ్రీనారాయణు(డే పరంబనుచుమీా ♦ చిత్తంబులో నెంచుఁడీ। యీనారాయణుశంఖచక్రములనెం ♦ తేభక్తి చేఁదాల్చుఁడీ॥ తానేదిక్కనినమ్మిసద్గురుపుచే ♦ తన్యాసముంగాంచుఁడీ। నేనీనాటికిధన్యునై తినను చుఁ ♦ నిక్కంబుగా నెంచుఁడీ ॥ 98 ॥ పరతత్వాధ్యాయంబిది। హరియే ననుమున్నుఁ జేసి ♦ యానారాయణ గఁ। పరిపూర్తిగముగియించెను ॥ కరుణను తా నెన్నిదవదిగా♦ నిబ్భాతిఁ॥ శ్రీః శ్రీః శ్రీః



శ్రీః.
శ్రీకురుమూర్తిఁ శ్రీనివాస ప్రసీద.
శ్రీహయగ్రీవాయ నమోనమః.

# ప్రణవదర్పణము.

## శరణాగత్యధ్యాయము. ( ౧౦ )

గీ॥ నాగురూత్తములను దొల్త ♦ నడుమ నాథ। యామునార్యులు కొన్న శ్రీ ♦ హరి వెలుంగ। నిటుల వరుసగ భక్తి మెం♦ తేనిబొదల। గురుపంపర నెల్ల నే ♦ గొలుచువాఁడ.

సీ॥ పరతత్వంబది విష్ణువేయనుచుఁ జె ♦ ప్పంజెల్లె వైకుంఠము। న్పరమున్జేరెడి రీతియెట్టిదియొ యే ♦ పుణ్యంబు చేచేకురుఁ। తిరమాలోకమటంచ్రు దానినెకదా! తెల్లంబుగా దెల్పెదఁ। ధరవిద్వద్గణ నీయులార కృపచే ♦ తన్గాంచుడీ నాపయిఁ ॥1॥ గీ॥ భక్తి యోగంబులను సేయ ♦ శక్తి లేక। యెంతయేనియు సంసార♦ మీాదలేక। యింద్రియంబులనింతయు ♦ నీడ్చలేక। కుందువారల హరిఁ జేర్చు ♦ నందలంబు॥2 ఉ॥ చెప్పదుకాపురంబులను ♦ చిందరవందర జేయుడంచునుఁ। విప్పనుశక్తికిన్నిగుల ♦ వేగిగుకర్మల జేయుడంచునుఁ। రొప్పదువర్ణధర్మ

ముల ♦ రూపరఁజేయుఁడటంచు నెప్పుడేన్ । తప్పదునాకు మోక్షమ
ని ♦ ధైర్యముమాత్రముఁ బూనుడంచనున్ ॥3॥ గీ॥ ఆది యుగముల
నుండిన ♦ యదియజుండు। క్రొత్తదిదిగాదు బ్రహ్మరు ♦ ద్రులునుభక్తి
మెలఁగియిద్దీని చేపట్టి ♦ సేవ్యులయిరి। గాన మాహాత్మ్యమిట్టిది ♦ గలు
గదెచట ॥4॥ చం॥ తొలుత నె జీవులందరును ♦ తోయజనాభునిఁగొ
ల్చునట్టి దా । సులుగదయంచు జెప్పితిని ♦ సోలుచు పాపచయంబు
చేత వా। తలు కలిబాధ శ్రీహరి ని ♦ శాశరణంబొనరించి యెల్లవే ।
ల్పులుసములంచు గొల్చుటను ♦ భోరునకట్టడు లిట్లువచ్చెడిన్ ॥ 5 ॥
గీ॥ కాన హరియంత రక్కుఁడు ♦ గాడటంచు। దలచినందున దగిలిన ♦
దురితములను। దోలి వైకుంఠమునువేగ ♦ దూరునట్టి । విత్తముఁదెలిపి
దెనెంతయు ♦ విస్తరించి ॥6॥ గీ॥ లోకము నందు నెవ్వనికి ♦ లోబడ
కుండిన వానిఁగట్టిచే। తేకువఁగొల్వ పీడిజను ♦ దేరక యుండిన వాఁ
డొకప్పుడున్ । పీకగపీని నన్నిటిని ♦ వేదొలఁగింపఁ దలంచియుండగా
నీకొలగాని యాతనికి ( నెంతయుఁ గూర్చెడి వానిఁ జేరుచున్ ॥7॥
చం॥ అనయము తప్పసేసితిని ♦ యాతఁడుమిక్కిలి కోపమందె మీ।
వినయముఁజూపి కోపమును ♦ వేదొలగింపుచు నన్నుఁగూర్మిచే। గ
నుఁగొను రీతిసేయుఁడని ♦ గ్రచ్చరనాతని గూర్పు నెమ్మిగా । నినిఁగ
రగించి యాపిదప ♦ నేర్పునెంతయు దీనుడైతగన్ ॥8॥ ఉ॥ ఆతనినె
మ్మిగాడుతన ♦ యందలికూరిమి మున్నుఁబోవగా। నాతనివెంట దైన్య
మును ♦ నంతయుఁజూపుచు బోయిబోయి తాఁ। జేతులుమోడ్చి దై
న్యమును ♦ జెందువిశంబును తేటఁజూపఁగా। నాతరిపిరి మిత్రుఁడవి ♦
యెల్లనుదీరిచి పిరిఁజేర్చడే ॥9॥ గీ॥ కానసాగతి యాచార్యు ♦ గాంచి
తొలుత। భక్తినెంతయు భరసమ ♦ ర్పణముసేయ । వారు గరుణించి
యాతని ♦ శౌరియందు। చెలఁగి భరసమర్పణమును ♦ జేయువారు ॥
10॥ శా॥ ఈరీతిన్శరణాగతిన్బడసి యెం ♦ తేదుఃఖము ల్బాయుచున్ ।
ధీరాత్ముండయి మోక్షమబ్బుననుచుం ♦ దిట్టంబుగా నెంచుచు। న్వేరే
వేల్పులతల్పమాని హరినే ♦ వేమారు చింతింపుచున్ । సారోత్తంస
ములైన వర్ణముల నా ♦ చారంబు స్సల్పుచున్ ॥11॥ కం॥ మెలగుడు

మెలగినయంతనె। దొలగును పాపంబులెల్లఁ దొరకును మోక్షం। బిల నింతకన్న మోక్షము। వెలయించెడి మార్గమేమి ‡ వెలయదుసుండీ ॥ 12॥ చం॥ తనువిడనాడినందున క ♦ దాయిటు పాపచయంబురాకదీ। నినిఁదొలగింపఁ జేయుటకు ♦ నేటికినెంచ భరార్పణంబుక। న్ననుమరి వేరెతోఁ ప్రియది ♦ నాటికినేటికి దేలదేలనా। వినుడిఁక విన్నవించెదను ♦ వీనులు సంతసమంద బ్రీతితోఁ ॥13॥ ధనికునితోడ ద్వేషమును ♦ తాఁదొలగింపగ వేరువాని గొ। ల్చినను మరేమిఁ జేసినను ♦ జెప్పరెద్వేషము బోవునొక్కొయా। ధనికునిఁ గొల్వ ద్వేషముది ♦ తప్పకబోవదె యట్లెవిష్ణునే। వనువిడగన్న పాపములు ♦ వారిప్రపత్తిని వీడకుండునే ॥14॥ గీ॥ కానహరి శరణాగతి ♦ గాంచినంత। హరిదయాఖుఁడు పాపము ♦ లన్నిఁదోలి। మోక్షమిచ్చుట కర్హుండు ♦ ముదముతోడ। నతనిగరిగింప శరణంట ♦ నదియెత్రోవ ॥15॥ కం॥ శరణాగతి యననేమొకో । మరియు భరార్పణ మనంగ ♦ మహి యెట్టిదియో । తిరముగ దెలిసెడినట్టుల। వరలంజేయుండు దాని ♦ వైభవమలరన్ ॥ 16॥ గీ॥ శ్రుతులజాడయెలేదు బో♦ స్మృతులతెరగు। లంతకన్ననుసున్నయ్యె ♦ వింతలేల। యట్టిపల్కులు మరియెట్లు ♦ పట్టుబడున। టన్న వివరింతువాని నో ♦ యార్యులారా ॥17॥ గీ॥ సర్వవిధ భారమెల్లను♦ సర్వశక్తుఁ। డయిన నారాయణునియందె ♦ యులరనునిచి। ధన్యతముఁడను నేనంచు ♦ ధైర్యమూని। యల్పుకిప్రియ నుండుటయె భర♦ న్యాసమనఁగ ॥18॥ గీ॥ పైనఁజెప్పిన యర్థంబు ♦ బల్కునట్టి। స్మృతులగొన్నింటివాప్రిసెద ♦ జెలగియిపుడు। దానిదిలకించి మైనను ♦ ధన్యులార। నిక్కమనియెంచుడీ మీరు ♦ నేర్పుతోడ ॥19॥ గీ॥ పలునఁజెప్పినయర్థంబు ♦ పలుకునట్టి। స్మృతులఁ గొన్నింటివాప్రిసెద ♦ జెలఁగియిపుడు। దానిఁదిలకించి మైనను ♦ ధన్యులార। నిక్కమనియెంచుడీ తాము ♦ నెమ్మనము॥20॥ (స్తో, ఖా, అహిర్బుధ్న్యసంహిత) స్మృ॥ అహమస్మ్యపరాధానా మాలయో కించనోగతిః। త్వమేవో పాయభూతో మేభవేతి ప్రర్థనామతిః। శరణాగతిరిత్యుక్తాసాదేవేస్మిన్ప్రియుజ్యతాం॥ గీ॥ ఎన్నివిధముల పాపము ♦ లున్నయవియొ। యన్నిటికినేన యిల్లయి

యున్నవాడ। దీనుడనునాకు నెవ్వరు ♦ దిక్కులేరు। నీవెనాకింక దిక్కు
గా ♦ నిలిచి బ్రోవు ॥21॥ గీ॥ అనుచు ప్రార్థించుటయె శర ♦ ణాగతియన। దనరుదీనజనకలులు మా ♦ ధవుని గూర్చి। దిట్టమైనట్టి భక్తిచే♦ ప
ట్టివేగ। సలుపుడనుగద యహిర్బుధ్న్య ♦ సంహితయును ॥ 22 ॥ స్తో, భా, భరతముని ప్రణీతము. ) అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస
పూర్వకం। తదేకోపాయతాయచ్నా ప్రపత్తిశ్శరణాగతిః॥ గీ॥ అన్య
లెవ్వాటికినిఁదీర్ప ♦ నలవిగాని। కోర్కె శ్రీహరిచేత చే ♦ కూరునని। గొప్పవిశ్వాసమున వారి ♦ గోరికొలిచి। మనుట శరణాగతియటంచు
మహి వెలుంగు ॥23॥ కం॥ శరణాగతి రూపంబును। వరలంజేసితిరిదీని♦
వరియించినచో। దురితంబులెల్ల దొలగును। దొరకును మోక్షంబటం
చు ♦ దోపదటన్నా ॥24॥ స్తో, భా, అనేనైవంప్రపన్నస్య భగవం
తంసనాతనం। తస్యానుబంధాః పాప్మానస్సర్వే నశ్యంతితత్క్షణాత్। కృ
తాన్యనేన।సర్వాణి తపాంసిత పతాంవర। సర్వతీర్థాని స్సర్వయజ్ఞా
స్సర్వదానాని తత్క్షణాత్। కృతాన్యనేనమోక్షశ్చ తస్యహస్తే నసంశ
యః॥ ఉ॥ ఈగతి నాపరాత్పరుని ♦ నెంతయువేడి ప్రపన్నుఁడైనచో।
వేగమె యున్నిపాపముల ♦ వీడుచు యజ్ఞతపఃఫలంబు కా। శీగమనాదిసత్ఫలము ♦ శ్రేష్ఠపు దానఫలంబులన్నియున్। ప్రోగుగగూర్చి కూ
ర్మితన ♦ పొందెలొసగున్ తుది మాధవుండుతాన్ ॥25॥ స్మృ॥ యద్యేన
కామకామేన నసాధ్యాసాంధనాంతరైః। ముముక్షుణాచయత్సాంఖ్యే
యోగేననచభక్తితః। ప్రాప్యతే పరమంధామ యతోనా వర్తతేయ
తిః। తేనతేనాప్యతేతత్త న్న్యాసెనైవమహామునే। పరమాత్మాచతె
నైవ సాధ్యతేపురుషోత్తమః॥ గీ॥ ఇతర పనులవి యెన్నియో ♦ నెంచి
యెంచి। జేసిరేనియు ఫలములఁ జెందగాదో। యట్టికట్టడి పనులన్ని♦
న్యాసమునవె। తత్క్షణంబున పండుగా ♦ దసరుజూండీ ॥ 26 ॥ మ॥ అవ
నిన్ భక్తిని సాంఖ్యయోగములచే । నైన్ముముక్షుండుమా। ధవుధా
మంబునుజెందలేక మదిసం ♦ తప్తుండునై దీనుఁడై। యవముందోలెడి
శౌరియందున భర ♦ న్యాసంబుఁ గావింపఁగా। నవలీల న్ఘటియించు
ముక్తిహరి ప్ర సే త్యక్షంబుతా గాంచెడిన్ ॥27॥ స్తో, భా, భారత

మున. అహం భీతోస్మి దేవేశ సంసారేస్మిన్భయావహే । త్రాహిమాం పుండరీకాక్ష నజానేశరణాంపరం। వృద్ధేవభవతోయాతా భూయసీజ న్మసంతతిః। తస్యామస్యతమంజన్మ సంచింత్యశరణంవ్రజ॥సీ॥భయము లనోసంగనీ♦ పాపిసంసారంబునకునోర్చియోర్చియా♦ నాడువెఱచి। ది క్కుళేరెవరింక ♦ దిక్కునీవెయటంచు నమ్మినిన్జేరితి ♦ నన్నుఁ బిలిచి। కరుణింపుకరుణింపు ♦ కరుణింపుమోదేవ యగతికుండయివచ్చి నను చుదలంచి। అనుచు నెంతయువేడి ♦ కొని వారికృపకెల్ల పరమపాత్రం బుగా ♦ భక్తినునిచి। యనుచు శరణాగతుని జేయు డయ్యలార। మె న్నిజన్మము లెనెగెనో ♦ యీశులార। ధాని లెక్కింపవలదె వి♦ ద్వాం సులార। దీని నటుసల్పకుండుడీ ♦ ధీరులారా ॥28॥ స్తో, భా, అధపా తకభీతస్త్వం సర్వభావేనభారత। విముక్తాన్య సమారంభో నారాయణ పరోభవ। సర్వయోగ్యమనాయాసం శరణంగంతుమర్హసి॥ ఉ॥పా పపుకొండలన్నదము ♦ భారత చింతిలనేల సర్వసం। తాపమున్మానుచుని స్నమము ♦ తథ్యముయోగ్యము సర్వజాతికిన్। శ్రీపతి పాదపద్మముల జెచ్చెరగా శరణంబుఁజెందు మిం। కేపనివేని శ్రీశుకొఱ ♦ కేయనిసే యుడు దీరుననిన్నియున్ ॥29॥ స్తో, భా, వ్యా, తమేపసర్వభావేన ప్రి యాహిత్వంమహామునే। అన్యత్సర్వం పరిత్యజ్య తమేవ శరణంవ్రజ॥ గీ॥ అన్నిటికి పరమాత్మయా ♦ హరిగలం। టంచు నెరనమ్మి యంత యు ♦ డించి భక్తి। చెలంగి శ్రీహరిశరణంబుఁ ♦ జెందరయ్య। యన దె జయసంహితయును తా ♦ నలరియిటుల ॥30॥ స్తో, భా, విష్వక్సే నసంహిత ) స్మృ॥ సర్వధర్మాన్సర్వకామా నైహికాముష్మికానపి। సంత్యజ్యవిధినానిత్యం మద్విధా శరణాగతిం। ఆచార్యానుజ్ఞయాకు ర్యాచ్ఛాస్త్రదృష్టేనవర్త్మనా॥ గీ॥ ఐహికాముష్మికంబుల ♦ న టులె కామములను సర్వంబువిడనాడి ♦ గురువునాజ్ఞ। గోరి యాశా స్త్రపద్ధతి ♦ నారుతెలుగు। లైనశరణాగతినిఁజెంది ♦ హరినిఁ గనుఁడీ॥ 31॥ శా॥ ఏమో సెప్పితిరింత వీనులకువిం ♦ దేయయ్యెగా నీహరుం। డేమైననన్నరియిట్లు సెప్పెనె యిదిం ♦ తేగాకదేవాఘముల్ । తామీరీ తులసల్పిరేమి యిదియుం ♦ తన్జెప్పుడీ యన్న మీ । క్షేమార్థంబయు

చెప్పఁబూనితిసుక్తి ♦ శ్రీవిష్ణునిన్వేడుచున్ ॥32॥ కాలనేమివధేర్వృదః యోసౌసాక్షా ద్వేదమూర్తిర్యత్రదేవాః ప్రతిష్ఠితాః। తంయామశరణంవిష్ణుం సర్వేసేంద్రాదివౌకసః॥ చం॥ ఎవనియందున వేదంబు ♦ లిమిడియుండు। నఖిలమన్నియు నెవనికి ♦ యర్థముగునో। యట్టివిష్ణువు శరణంబు ♦ నందుడింక। యింద్రుమఖ్యాది సురలార ♦ యిపుడెగదలి ॥33॥ చం॥ అనియిటు కాలనేమికిభ ♦ యంపడి తన్గని వేడగాను వ ♦ చ్చిన సురకోటులందరిని ♦ జెచ్చెరఁ గూరిమిఁజూచి మీకుమా। కన యాపదిక్కు విష్ణువెక ♦ దాయికగావున నింద్రుఁగూడి చ। య్యనశరణంబుఁజెందజను ♦ డాహరియన్నియుఁదీర్చి బ్రోచెడిన్ ॥34॥ క॥ అనికూర్మిఁబల్కిన రు। ద్రునిపల్కుఁదలచి దేవ ♦ తులునకెరుద్రుం। డును శరణాగతిమది న। మ్మినవారలటంచు నిక్క ♦ మేయనవలసెన్ ॥35॥ ఇదియునుఁగాక. శ్రు॥ రుద్రాదిత్యావసవోయేచ సాధ్యావిశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ। సర్వేభవంతం శరణంగతాస్మః కురుష్వపూజ్యానిహ విశ్వమూర్తే॥ గీ॥ నలువముక్కంటి మొదలుగా ♦ గలుగువేల్పు। లెల్లరము నిన్నెశరణని ♦ యిదిగోనమ్మి। నారమీ మమ్ముఁగూర్మి ♦ జేంగదీసి। వెలయఁజేయుము వేవేగ ♦ విశ్వమూర్తి ॥36॥ గీ॥ దీనిఁబాగుగ బాడగన్న ♦ దేవసంఘు। మెల్ల రుద్రునితోగూడ ♦ మొతయేని। భక్తిమార్గయందు భరసమ ♦ర్పణముఁజేసి। నట్లు నేటగఁదేలదే ♦ యార్యులారా ॥37॥ చం॥ దేవతులెల్లరు న్నిపుఁడు ♦ దిట్టపుభక్తి భరార్పణంబు నీ। దేవునియంద జేసిరని ♦ తెల్లముగాని టుఁజేసియుంటచే। దేవుఁడు విష్ణువేయతనిఁ ♦ దేల్చెడినట్టిది న్యాసమే యనఁ। గావెర వేమి సెప్పెడిక ♦ కారుణికోత్తము లారప్రీతితోన్ ॥38॥ ఇంకయును. వ్యాసస్మృతి॥ నవిష్ణ్వారాధనాత్పుణ్యం విద్యతేకర్మవైదికం। తస్మాదనాదిమధ్యాంతం నిత్యమారాధయేద్ధరిం। తద్విష్ణోరితిమంత్రేణ సూక్తేనపురుషేణచ। నైవాభ్యాం సదృశోమంత్రో వేదేషూక్తా శ్చతుర్ష్వపి। నివేదయీతస్వాత్మానం విష్ణావమలతేజసి। తదాత్మాతన్మనాశ్శాంతా స్తద్విష్ణోరితి మంత్రతః॥ సీ॥ హరిపూజకన్న వే ♦ రగు పుణ్యమేలేదు కర్మయుదెట్టిదే♦న్గానిలేదు। తద్విష్ణో యనెడి

